4-12-1992 శుక్రవారం 10 పేజీలు సంపుటి : 63 సంచిక :49 విడిప్రతి : రు. 2.00 లు

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



### నిర్ణయాలు తిరగదోడుతున్నారు; నియామకాలు రద్దు; సన్నిహితులకు బదలీ శిక్ష!

# జనార్ధన రెడ్డితో కోట్ల జగడం?

నెదురుమల్లి జనార్ధన రెడ్డి ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలను కోట్ల ప్రభుత్వం తిరగతోడుతోంది. ఇసుక లీజు వేలం పాటలు, ప్రభుత్వ పశువుల ఆస్పత్రుల మంజూరుకు ఇప్పటికే బ్రేకుపడింది. అలాగే జనార్ధన రెడ్డి ప్రభుత్వంలో జరిగిన అనేక నిర్ణయాలు, నియామకాలు కోట్ల ప్రభుత్వం సమీక్షిస్తోంది.

జనార్ధన రెడ్డి ప్రభుత్వంలో మంత్రిగా వున్న మాదాల జానకి రామ్ ఇసుక క్వారీల లీజులను విద్యాధికులైన నిరుద్యోగులకు ఇస్తూ ఉత్తర్వులు జారీ చేయించారు. అయితే కోట్ల ప్రభుత్వంలో గనుల మంత్రి అయిన చేగొండి హరిరామ జోగయ్య పాత ప్రభుత్వ నిర్ణయాన్ని అమలు కాకుండా నిలిపివేశారు. ఇసుక లీజులు ఇవ్వటంలో పక్షపాత ధోరణి కనిపిస్తున్నందున పాత ప్రభుత్వం నిర్ణయాన్ని నిలిపి వేసినట్లు జోగయ్య సమర్ధించుకున్నారు. చివరకు ఈ వ్యవహారం కాస్తా కోర్టుకు ఎక్కింది.

పాత ప్రభుత్వంలో పశు సంవర్ధక మంత్రిగా వున్న సంగీతం వెంకట రెడ్డి నియమ నిబంధలను పక్కకు పెట్టి ఇష్టం వచ్చినట్లు కొత్తగా ప్రభుత్వ పశువుల ఆస్పత్రులను మంజూరు చేశారు. మొత్తం 160 ఆస్పత్రుల్లో మంత్రి మంజూరు చేసినవి గాకుండా ముఖ్యమంత్రి కోటాలో కొన్ని మంజూరయ్యాయి. అప్పట్లో ఆహార వ్యవసాయ శాఖ కార్యదర్శిగా వున్న హెచ్. బాబు కూడా నియమావళికి నీళ్లొదలి పక్షపాతంతో మరి కొన్ని కొత్త ఆస్పత్రులకు మంజూరు ఇచ్చారు. పాత ప్రభుత్వం పక్షపాత ఉత్తర్వుల పై పలువురు ఎమ్మెల్యేలు కోట్లకు ఫిర్యాదు చేయగా, వెంటనే ఉత్తర్వులను నిలిపి వేయాలని ఆయన ఆదేశించారట.

ప్రభుత్వ ప్లీడరు గ్రంధి మాధవి నియామక వ్యవహారంలో వేలు పెట్టి కోట్ల ప్రభుత్వం చివరకు నాలుక కరుచుకుంది. హై కోర్టులో ప్రభుత్వ ప్లీడరుగా నియమించబడిన గ్రంధి మాధవి తన విధులను సక్రమంగా నిర్వర్తించకుండా ప్రత్యర్థులతో లాలూచీ పడి ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నందుకు జనార్ధన రెడ్డి ప్రభుత్వం ఆమె నియామకాన్ని రద్దు చేసింది. దీని పై గ్రంధి మాధవి కోర్టుకు వెళ్లారు. అయితే హై కోర్టు కూడా జనార్ధన రెడ్డి ప్రభుత్వ నిర్ణయం సమంజస మేనని సమర్థించింది. కోట్ల ముఖ్యమంత్రి అయ్యాక గ్రంధి మాధవిని తిరిగి ప్రభుత్వ ప్లీడర్‌గా నియమించారు. హై కోర్టు అభిశం సించిన మాధవిని తిరిగి నియమించి నందుకు కొత్త ముఖ్యమంత్రి విమర్శలకు గురి కావల్సి వచ్చింది.

రోడ్లు భవనాల శాఖ చీఫ్ ఇంజనీరుగా పదవీ విరమణ చేస్తున్న జయశంకర రెడ్డికి మరో రెండేళ్ల పాటు సర్వీసు పొడిగిస్తూ అప్పటి ముఖ్యమంత్రిగా జనార్ధన రెడ్డి ఆదేశాలు జారీ చేయగా కొత్త ముఖ్యమంత్రి కోట్ల ఇందుకు సంబంధించిన ఫైలును స్వయంగా తెప్పించుకొని జనార్ధన రెడ్డి నిర్ణయాన్ని రద్దుచేస్తూ ఉత్తర్వులు జారీ చేశారు. పదవీ విరమణ చేసి పునర్నియమించబడిన మరి కొంత మంది అధికారుల నియామకాలను కూడా కోట్ల సమీక్షిస్తున్నారు. త్వరలోనే వీరికి ఉద్వాసన చెప్పేందుకు కోట్ల నిర్ణయించారని తెలుస్తోంది.

వీటన్నిటికంటె ముఖ్యమైనది ఐఎఎస్ అధికారుల బదిలీ. జనార్ధన రెడ్డికి సన్నిహితంగా మెలిగిన ప్రిన్సిపల్ కార్యదర్శి స్థాయి సీనియర్ అధికారులను శంకరగిరి మాన్యాలు పట్టించినంత పనిచేస్తున్నారు ముఖ్యమంత్రి. హెచ్కె బాబుతో ఈ కార్యక్రమం మొదలైంది. చంద్రమౌళి, వలియప్పన్ వంటి వారికి బదలీ శిక్ష తప్పలేదు. సమర్థులైన ఈ అధికార్లను అప్రధాన శాఖలకు బదలీ చేయడం ద్వారా జనార్ధన రెడ్డికి పరోక్ష సందేశం పంపించ దలివాడో ఏమో తెలియదు. వీరిద్దరి సంబంధాలు మధ్య బెడిసిపోతున్నాయని మాత్రం ఈ మార్పులు సూచిస్తున్నాయి. జనార్ధన రెడ్డి ఇంట్లో ఎమ్మెల్యేలు అధిక సంఖ్యలో కన్పించడం, అధికారులు ఆయన మాటను వేద వాక్కుగా భావించడం ముఖ్యమంత్రికి కష్టం కల్గించినట్లుంది; ఈ రూపంలో కసి తీర్చుకున్నాడు.

వ్యవసాయ కనెక్షన్లకు రైతుల నుంచి వసూలు చేస్తున్న స్లాబ్ వంద రూపాయలను కోట్ల ప్రభుత్వం డెబ్బయ్ అయిదు రూపాయలకు తగ్గించింది. అలాగే ఆకు పచ్చ కార్డు పై సరఫరా చేస్తున్న 16 కిలోల బియ్యాన్ని ఇరవై కిలోలకు పెంచుతూ కోట్ల నిర్ణయం తీసుకున్నారు.

రైతులకు విద్యుత్ స్లాబ్‌ను స్వల్పంగా తగ్గించిన కోట్ల ప్రభుత్వం గృహావసరాలు, పరిశ్రమలకు భారీగా వడ్డించింది. అలాగే ఆర్టీసి బస్సు చార్జీలు పెద్ద మొత్తంలో పెంచేందుకు కొత్త ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. మున్సిపాల్టీల్లో ఆస్తి పన్ను, వృత్తి పన్నులు పెంచేందుకు కోట్ల ప్రభుత్వం సూత్రప్రాయంగా నిర్ణయించింది.

### కర్నూలు నుంచి కోట్ల పోటీ

కోట్ల విజయభాస్కర రెడ్డి కర్నూలు అసెంబ్లీ నియోజక వర్గం నుంచి పోటీ చేస్తారు. దీని కోసం అప్పుడే ప్రత్యేక అధికారులను కర్నూలుకు పంపి నియోజక వర్గ సమస్యల చిట్టాను తయారు చేయించారట. ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని కర్నూలు నియోజక వర్గానికి త్వరలోనే తాయిలాల పంపకం జరుగుతుంది. కోట్ల కోసం ప్రస్తుత కర్నూలు ఎమ్మెల్యే మాజీ మంత్రి రామ్‌భూపాల్ చౌదరి త్వరలోనే రాజీనామా చేస్తారు. ఆయన త్యాగానికి ప్రతిఫలంగా రాజ్యసభ సీటు దక్కవచ్చు. లేదా కోట్ల స్థానంలో లోక్ సభకు టిక్కెట్టు సంపాదించుకోవచ్చు.

# శ్రీపాదకు మంత్రిత్వ గాలం?

అసెంబ్లీస్పీకర్ శ్రీపాదరావును మంత్రివర్గంలోకి తీసుకోవాలని కోట్ల నిర్ణయించారు. పి.వి.కి అత్యంత సన్నిహితుడైన శ్రీపాదరావును స్పీకర్‌గా పెట్టుకొని అసెంబ్లీ సమావేశాల్ని నిర్వహించడానికి కోట్ల సుముఖంగాలేరు. కీలకమైన స్పీకర్ స్థానంలో తన సొంత మనిషిని తెచ్చుకోవాలంటే శ్రీపాదకు మంత్రి పదవి ఇవ్వక తప్పదు. అయితే స్పీకర్ పదవి ప్రాధాన్యత దృష్ట్యా తాను మంత్రివర్గంలో చేరనని శ్రీపాద రావు అంటున్నారు. శ్రీపాదకు గాలం వేసేందుకు ప్రాధాన్యత గల వైద్య ఆరోగ్య శాఖను ఇస్తామని కోట్ల కబురు పంపినట్లు తెలిసింది. స్పీకర్ సీటు ఖాళీ అయ్యే పక్షంలో ఆ స్థానంలో వరంగల్ జిల్లా ఎమ్మెల్యే పురుషోత్తమరావును కూర్చోబెట్టాలని కోట్ల అనుకుంటున్నారట. డిప్యూటీ స్పీకర్‌గా వున్న ఆలపాటి ధర్మారావు మంత్రివర్గంలో చేరడంతో ఆ కుర్చీ కూడా ఖాళీగా వుంది. ప్రకాశం జిల్లా పర్చూరు ఎమ్మెల్యే గాదె వెంకట రెడ్డి పేరు దీని కోసం పరిశీలిస్తున్నారట.

### రవీంద్ర రెడ్డికి పదవి ఖాయం

వై.ఎస్. కుడి భుజం మాజీ రెవిన్యూ మంత్రి డి.ఎల్. రవీంద్ర రెడ్డికి మంత్రి పదవి దాదాపు ఖాయమంటున్నారు. దానికోసమే రవీంద్ర రెడ్డి వున్న ప్రభుత్వ బంగ్లాను ఇంత వరకు ఎవరికీ కేటాయించ లేదు. అనంతపురం జిల్లా నుంచి మాజీ మంత్రి లక్ష్మీదేవికి మంత్రివర్గంలో స్థానం లభిస్తుంది. వీరిద్దరికి మంత్రిపదవులివ్వటం వల్ల వై.ఎస్. మైత్రి హస్తాన్ని అందుకోవచ్చని కోట్ల భావిస్తున్నారట.

విశాఖపట్నం జిల్లా నుంచి గుర్నాధరావు, బాలరాజుల్లో ఎవరో ఒకరికి పదవి ఖాయం. ఇందులో గుర్నాధరావు నెదురుమల్లి వర్గీయుడు కాగా బాలరాజు ద్రోణంరాజు మనిషి. శ్రీకాకుళం నుంచి చిత్తూరు జిల్లా వరకు కోస్తాలోని సుమారు పది జిల్లాల్లో రెడ్డి కులానికి చెందిన మంత్రి

కొరవ 10 పేజీలో

# అసమ్మతి చిచ్చు నివారణకు వైఎస్ మెడకు మైత్రి ఉచ్చు!

అసమ్మతీయులుగా ముద్ర వేసుకున్న సుమారు నలభై మంది ఎమ్మెల్యేలు, తొమ్మిది మంది మాజీలు ప్రస్తుతం పదవుల్లేక గోళ్లు గిల్లుకుంటున్నారు. మంత్రి వర్గ విస్తరణలో అయినా తమకు పదవులు లభిస్తాయో లేదో వేచి చూసి ఆ తర్వాత తమ కార్యక్రమాన్ని రూపొందించు కోవాలని వీరంతా నిప్పురు గప్పిన నిప్పులా వున్నారు. లెజిస్లేచర్ పార్టీ నాయకుడిగా కోట్ల తమను కలుపుక పోకపోతే త్వరలోనే 'ముప్పు' తప్పదని హెచ్చరిస్తున్నారు. అసమ్మతి చిచ్చుకు భయపడి కోట్ల తన మద్దతు దారుల ద్వారా వై.ఎస్. రాజశేఖర రెడ్డి మెడకు మైత్రి ఉచ్చు బిగించటానికి ప్రయత్నాలు ప్రారంభించారు. తన 'ఇంట్లో మనిషి' అయిన రెవిన్యూ మంత్రి రామిరెడ్డిని, మాజీ మంత్రి నారపరెడ్డిని

### పివి కూడా సరే నన్నాడా?

ఇందు కోసంగా పురమాయించారు. ఈ నేపథ్యంలో అసమ్మతియుల్ని 'అస్మదీయులుగా' చేసుకునేందుకు కోట్ల మంత్రి వర్గ విస్తరణకు నడుంకట్టారు. రాష్ట్ర వార్షిక ప్రణాళిక ఖరారు కోసం ఇటీవల ఢిల్లీ వెళ్లిన కోట్ల మంత్రివర్గ విస్తరణను గురించి ప్రధాని పి.వి.తో ప్రస్తావించి అనుమతి పొందినట్లు ముఖ్యమంత్రి సన్నిహిత వర్గాలంటు న్నాయి.

### మంత్రిత్వాలకు తహతహ

అసమ్మతీయులకు మంత్రి వర్గంలో స్థానం కల్పించేందుకు డిశంబరు మొదటి వారంలో రాష్ట్ర మంత్రి వర్గాన్ని విస్తరించాలని ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి యోచిస్తున్నారు. తొలుత మంత్రివర్గం ఏర్పాటులో కోట్ల అసమ్మతియుల్ని అమడ దూరంలో వుంచారు. తొలి క్యాబినెట్‌లో చేర్చుకున్న 31 మంది మంత్రుల్లో నలుగురు తప్ప మిగిలిన వారంతా నెదురుమల్లి జనార్ధన రెడ్డి మద్దతుదారులే. జనార్ధనరెడ్డిని గద్దె దించే వరకు విశ్రమించేది లేదని భీష్మ ప్రతిజ్ఞ చేసిన డాక్టర్ వై. రాజశేఖర రెడ్డి వర్గీయుల్లో కనీసం ఒక్కరికి కూడా మంత్రి పదవి లభించలేదు. జనార్ధన రెడ్డికి వ్యతిరేకంగా మంత్రి పదవులకు రాజీనామా చేసిన పదిమందిలో డి. శ్రీనివాస్‌కు మినహా మరెవరికీ మంత్రి పదవులు లభించలేదు. జనార్ధన రెడ్డి తర్వాత తామే ముఖ్యమంత్రులమని ఆశలు పెట్టుకొని స్వీట్లు కూడా పంచుకున్న అరడజను మంది కూడా కోట్ల క్యాబినెట్‌లో అడ్రస్ లేకుండా పోయారు. వీరంతా ఇప్పుడు మంత్రి పదవుల కోసం తహతహ లాడుతున్నారు.

# పినాకిని తీరం

## జి.కె. రెడ్డి స్మృతి

'హిందూ' ద్వారా తాను చాలాకెక్కువ కాకుండా, తన ద్వారా 'హిందూ' కు దేశంలో, ముఖ్యంగా దక్షిణ రాష్ట్రాలలో, ఎనలేని ప్రాశస్త్యం కల్గించిన కీర్తి శేషుడు జి.కె.రెడ్డి, ఏ సంవత్సరానికి ఆ రోజు మనముందు సాక్షాత్కరింప జేస్తున్నారు శ్రీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. సుబ్బరామిరెడ్డి చేస్తున్న కార్యాల్లో అత్యంత విలువైనది, సార్థకమైనది జి.కె.రెడ్డి పేరుతో ఏటా ఒక ప్రసిద్ధ జర్నలిస్టును సన్మానించడం.

గునుపాటి కేశవరామిరెడ్డి (జి.కె. రెడ్డి) క్రూరమైన క్యాన్సర్ వ్యాధికి బలియైన ఆ పదేళ్ల నుండి తిక్కవరపు సుబ్బరామిరెడ్డి తాను స్థాపక కన్వీనరుగా జి.కె.రెడ్డి స్మారక అవార్డుల కమిటీని నెలకొల్పి దాని ఆధ్వర్యాన ఈ సన్మాన కార్యక్రమాన్ని దీక్షగా నిర్వహిస్తున్నారు. ఏటా హైదరాబాదులో జరిగే ఈ సన్మాన సభ ఈసారి ఢిల్లీలో జరిగి, సుప్రసిద్ధ ఆంగ్ల దిన పత్రిక హిందుస్థాన్ టైమ్స్ సంపాదకుడు శ్రీ హెచ్.కె. దువా ప్రధాని శ్రీ పి.వి. చేతుల మీదుగా అవార్డును అందుకున్నారు. రేడియో సమాచార శాఖామాత్యులు శ్రీ అజిత్ కుమార్ పాంజా అధ్యక్షతన జరిగింది అవార్డు ప్రదానోత్సవ సభ.

'హిందూ' ఢిల్లీ బ్యూరో అధిపతిగా తన రాజకీయ వార్తకు, వ్యాఖ్యకు వేద వాక్యంతటి సాధికారాన్ని సంపాదించుకున్న విశిష్ట జర్నలిస్టు జి.కె.రెడ్డి, అధికార పార్టీ రాజకీయాలలో, యుద్ధాల వంటి దేశ సంక్లిష్ట పరిస్థితుల్లో తన వ్యాఖ్యలు విశేషాల విశ్లేషణ కోసం పాఠకులచే ఎదురు కాపులు కాయించిన విషయపూర్ణుడు. వ్యక్తిగత రాగద్వేష రహిత జర్నలిస్టు జి.కె. రెడ్డి. ఆలోచనలో, కథనంలో, వివరణలో తనదైన సున్నితమైన ఒక బాణీతో పాఠకులను ఆకట్టుకున్న అరుదైన జర్నలిస్టు జి.కె.రెడ్డి. మడి కట్టుకున్న పత్రికగా పేరుపొందిన 'హిందూ' అధిపతులను సన్నిహితులను చేసుకోగలిగిన శీల సంపన్నుడు, సంస్కారవంతుడు, ప్రజ్ఞాశీలి అయిన జర్నలిస్టు జి.కె. రెడ్డి. 'హిందూ' ఢిల్లీ ఎడిషన్‌కు కారకుడైన జర్నలిస్టు జి.కె. రెడ్డి.

జి.కె. రెడ్డిలో ఆవేశం వుంది. వుద్రేకం వుంది. వురుకు తనం వుంది. కాని అవి మాటల వరకే, చర్చల వరకే, వాద ప్రతివాదాల వరకే – వ్రాత దగ్గరకు వచ్చే సరికి సమ్యమనం తప్ప తొందర పాటు, పొర్లుబాటు, దుడుకు తనం కనపడేవే కాదు. శ్రీనగర్‌లో 'కాశ్మీర్ టైమ్స్' ఇంగ్లీషు వారపత్రిక సంపాదకత్వం ; ఆజాద్ కాశ్మీర్ నుండి కరాచీ గుండా బొంబాయి చేరి 'బ్లిట్జ్' ద్వారా తన అనుభవ కథనాల బాంబులను పేల్చి గుండె గలిగిన జర్నలిస్టుగా విఖ్యాతుడు గావడం ; 'టైమ్స్ ఆఫ్ఇండియా' దినపత్రిక విలేఖరిత్వం – జీవితంలోని ఒడిదుడుకులు, ఆర్థంకులు, అవరోధాలు, అననుకూలాలు అన్నీ అధిగమించి అపారమైన అనుభవాన్ని గడించి పరిణితుడై చివరన హిందూలో చేరి దానికి అంకితమై పోయాడు జి.కె. రెడ్డి. హిందూతో ఆయన ఎంత తాదాత్మ్యమంది పోయాడంటే, యాజమాన్యం విశ్వాసాన్ని అత్యంతంగా చూరగొని అందులో ఒకడు అన్నంత సన్నిహితుడై పోయాడు జి.కె. రెడ్డి. ఆయన్ను తమ సంస్థలో ఒక వుద్యోగిగాకాక సంస్థ హితుడుగా, శ్రేయోభిలాషిగా, అవసర సమయాల్లో ఆయన సలహాలు పొందేంతటి ఆప్తుడై పోయాడు జి.కె. రెడ్డి. 'కాశ్మీర్ టైమ్స్' జి.కె. రెడ్డికి, 'హిందూ' జి.కె. రెడ్డికి పోలికే లేదు. తొలి రోజులకీ మలి రోజులకీ ఆయన ఎంత ఎదిగాడో చెప్పలేము. 'హిందూ' స్వభావ సాంప్రదాయాల ప్రభావం జి.కె. రెడ్డి మీద పడ్డాయా లేక జి.కె. రెడ్డి పలుకుబడి దాని మీద పనిచేసిందో గాని ఆ పత్రికలో, ఆయనలో కూడా మార్పు స్పష్టంగా దృగ్గోచరమైంది. ఏ జాతీయ మహానాయకుడికో 'హిందూ' మొదటి పేజీలో లభించే స్థానం, జి.కె. రెడ్డి మరణ వార్తకు లభించిందంటే ఆ సంస్థలో ఆయన స్థానం ఎంత సమున్నతమైనదో విదితమవుతుంది.జి.కె. రెడ్డి ఆంధ్రులు గర్వించ దగిన అగ్రశ్రేణి జర్నలిస్టులలో ఒకడు. నెల్లూరు జిల్లాలో అంతటి సమున్నత స్థాయికి చేరుకున్న ఏకైక జర్నలిస్టు ఆయన.

జి.కె. రెడ్డి పరిచయం స్మృతులను పునఃతలమకుంటూ, ప్రతి ఏడూ ఆయన్ను స్మృతి పథంలోకి తెస్తున్న శ్రీ తిక్కవరపు సుబ్బరామ రెడ్డిని మరోమారు అభినందిస్తున్నాను.

## పి.సి.రెడ్డి సేవలు

న్యాయవాది, ప్రజా సేవకుడు శ్రీ పి.సి.రెడ్డి ముప్పాతిక శతాబ్దపు జీవితాన్ని పూర్తిజేసి 76లో ప్రవేశించిన సందర్భంలో మొన్న 29 తేది అభినందన సభ జరిగింది. పి.సి.రెడ్డి గారు న్యాయవాద వృత్తి నుండి విరమించినప్పటి నుండి తన పూర్తి కాలాన్ని వివిధ వర్గాల సేవకు వినియోగిస్తున్నారు. అటువంటి వ్యక్తిని సభా ముఖంగా అభినందించడం సముచితమే.

పి.సి. రెడ్డి గారికి 75 ఏండ్లు నిండినాయంటే ఆశ్చర్యం కలుగుతుంది. రిక్షా ఎక్కడు; ఎంత దూరమైనా ధోవతి లాల్చీతో చక చక యువకుడిలా నడిచి పోతుంటాడు. నేను చూచిన వారిలో స్వర్గీయ వెన్నెలకంటి రాఘవయ్య గారు తప్ప ఆ వయస్సులో అంత చురుగ్గా నడవ గలిగేవారు లేరు. రాఘవయ్యగారు చేతి కర్ర పూపుకుంటూ పాతికేళ్ల యువకుడి వలె వుత్సాహం వురకలు వేస్తూ నడిచే వారు. ఆ విధమైన వటుత్వం ఇప్పుడు పి.సి. రెడ్డిలో కనపడుతుంది పి.సి.రెడ్డి చురుగ్గా నడవడమే కాదు, రోజులో ఎన్ని సంఘాల పక్షంగా అధికార్ల వద్దకు రాయబారాలు నడుపుతారో, ఎన్ని ఆఫీసుమెట్లు ఎక్కి దిగుతారో, ఎన్ని ప్రదర్శనలలో భాగస్వాములవుతారో, ఎన్ని ధర్నాలలో పాల్గొంటారో, ఎన్ని నివేదికలు వ్రాస్తారో, ఎన్ని పత్రికా ప్రకటనలు పంపుతారో లెక్క వుండదు. ఆ వయస్సులో అంత ఓపిక అసాధారణం. ఆయన కాలేజి లెక్చరరుగా వున్న సమయంలో విద్యార్థినైన నా బోటి వాడు ఆచార్యుణ్ణి చూచి సిగ్గు పడాల్సి వస్తోంది. కేవలం పేరు కోసమే అయితే పి.సి. రెడ్డి అంత శ్రమ తీసుకోలేరు; సేవాకాంక్ష ఆయనకు నిత్య నూతనోత్సాహాన్ని కల్గిస్తుండాలి!

అభినందన సభ కాబట్టి ప్రశంసా సుమాల వర్షం సహజం. అందువల్లనే ఒకరు పి.సి.రెడ్డి వంటి సంఘసేవకుడు రాష్ట్రంలో మరెక్కడా లేడని శ్లాఘిస్తే, మరొకరు ఆయన్ను రాజ్యసభకు నామినేట్ చేసి, పద్మశ్రీ పురస్కారం అందించడం ప్రభుత్వ విద్యుక్త ధర్మం అని సూచించారు. ఈ విధంగా ఒక డజన్ మంది తమ వుపన్యాసాలతో పి.సి. రెడ్డి గారిని వుక్కిరి బిక్కిరి చేశారు.

పి.సి. రెడ్డి గారికి ఒక కొరత వున్నట్లుంది. తాను విద్యార్థి దశ నుండి సంఘ సేవ చేస్తుంటే, దాదాపు 60 సేవా సంఘాలకు ఆధ్వర్యం వహించిపనిజేస్తుంటే, దానికి తగిన గుర్తింపు లేదనే నిస్పృహ నిర్వేదాలను ఆయన పత్రికల వారితో వెలిబుచ్చారు. మధ్య ఒకరన్నారు – పి.సి. రెడ్డి గారు 33 సంఘాల ద్వారా నిరుపమానంగా సేవచేస్తున్నారు. కాని 60అని తెలిసినప్పుడు నోరు అట్లే తెరచుకోవలసి వచ్చిందిఅని; అసలు ఇన్ని సంఘాలున్నాయని వాటిలో దేనికి గౌరవాధ్యక్షుడు, దేనికి అధ్యక్షుడు, దేనికి కార్యదర్శి అని ఆయన జ్ఞాపకం పెట్టుకోవడం సాధ్యమా అనిపించింది. ప్రజల గుర్తింపు, మన్ననలు ఏ సంఘసేవకుడైనా, ఏ ప్రజాసేవకుడైనా, మరెవరైనా పొందగలుగుతున్నారంటే ప్రజలలో ఏ ఒక వర్గ శ్రేయస్సుకో, ఏ సమస్య కోసమో, ఏ సంక్షేమం కోసమో, ఏ రాజకీయ సాంఘిక న్యాయం కోసమో జీవిత పర్యంతం తాముచేపట్టిన లక్ష్య సాధన కోసం పనిజేసినందువల్లనే కాని, ఎన్ని ఎక్కువ సంఘాల ద్వారా సేవజేసిదాన్ని బట్టి కాదు. పి.సి. రెడ్డి గారి సేవలకు తగినంత గుర్తింపు రాలేదంటే, ఆయన 60 సంఘాలకు ఆధ్వర్యం వహించడమే! దీనివల్ల ఆయనకు గుర్తింపు లభించక పోవడమే కాదు, ఒక రకంగా చుల్కన భావం కూడా ఏర్పడింది. నిష్ఠూరమైన నిజం ఇది!

పి.సి.రెడ్డి గారికి జమీన్‌రైతు మీద అసంతృప్తి వుంది. ఆయన కార్యకలాపాలకు, ప్రకటనలకు దినపత్రికలలో వార్తలు వస్తుంటే, జమీన్‌రైతులో రాకపోవడం ఆయనకు అసంతృప్తికరంగా వుంటుంది. మేము దురుద్దేశ్యంతోనో, వ్యతిరేకతతోనో పి.సి.రెడ్డి గారి వార్తలు ఇవ్వకుండడం లేదు. జమీన్‌రైతు వార పత్రిక; పి.సి. రెడ్డి గారి 60 సంఘాలకు సంబంధించిన వార్తలు, ప్రకటనలు వేయడం సాధ్యమా చెప్పండి! అంతే గాని దురభిప్రాయం గాని, వ్యతిరేకతతో గాని కాదు.

వ్యక్తిగతంగా నాకు గురుతుల్యుడు శ్రీ పి.సి. రెడ్డి. 75 ఏళ్ల ఫలవంతమైన జీవితాన్ని గడిపిన ఆయనకు శుభాకాంక్షలు తెలుపుకుంటున్నాను.

**జమీన్‌రైతు**
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

పూజ్యులైన మా తండ్రి

**ఏనుగ వెంకట నరసారెడ్డి గారు**

దివంగతులై

4.12.92 తేదికి పదహారేళ్లు గడచిపోయాయి.

ఈ సందర్భంలో ఆ పుణ్యమూర్తిని సంస్మరించుకుంటూ వారి కీర్తి మూర్తికి

**గౌరవాంజలి ఘటిస్తున్నాము.**

ఏనుగ శ్రీనివాసులు రెడ్డి, ఏనుగ జనార్దన కృష్ణారెడ్డి,
ఏనుగ సీతారామిరెడ్డి, ఏనుగ అనంత పద్మనాభా రెడ్డి
కుమారులు

తిక్కవరపు సీతారత్నమ్మ
కుమార్తె

# అభినందనలు

మా మిత్రుడు

**యేటూరు శివరామకృష్ణారెడ్డిగారు**

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ చెరకు అభివృద్ధి మండలి అధ్యక్షుడుగా నియమింపబడినందుకు మా

**హార్దిక శుభాభినందనలు**

– డి. శ్రీనివాస రావు
యు. రామారావు

# జమీన్‌రైతు

# టెర్రరిస్టుల మృత్యునీడ

భాగ్యనగరంపై టెర్రరిస్టుల మృత్యునీడ పడింది. కాశ్మీర్ తీవ్రవాదులు ఇక్కడ తమ స్థావరాలు ఏర్పాటు చేసుకుంటున్నారు. ప్రతి ఆంధ్రుడినీ కలవర పరుస్తున్న దుర్వార్త ఇది. ఇప్పటికే హైదరాబాదు అరాచక శక్తులకు ఆలవాలంగా తయారైంది. గుడుంబా గూండాలు, గుడిసెల రౌడీలు, మతకలహాల కిరాతకులు, నక్సలైట్లు... ఒకటేమిటి ? సంఘ జీవనాన్ని సంక్షుభితం చేసే మూకలన్నీ హైదరాబాదులో తిష్టవేసి వున్నాయి. వారికి తోడు కాశ్మీర్ టెర్రరిస్టులు ఈ మహా నగరాన్ని తమ మకాంగా మార్చుకుంటున్నారు.

ఎక్కడ కాశ్మీరు, ఎక్కడి హైదరాబాదు? అక్కడికి ఇక్కడికి రెండువేల కిలోమీటర్ల దూరం వుంది. మధ్యలో ఎన్నో నగరాలను దాటుకుని వస్తున్నారంటే, ఇక్కడ వారినాదరించి ఆశ్రయమిచ్చే వారు వుండి వుండాలి; లేదా ఈ నగరంలో అయితే పోలీసుల కళ్లు సులభంగా కప్పవచ్చుననే ధీమా కల్గివుండాలి. ఇవి రెండూ నిజమే నన్నా తప్పులేదు. హైదరాబాదు పాత బస్తీలో పాకిస్తానీయుల సంచారంపై చాలా కాలంనుంచి వదంతులున్నాయి. అక్కడి ముస్లింలు కొందరిలో పాకిస్తాన్ పట్ల ప్రేమ ఎక్కువనే ఆరోపణవుంది. కాని ఎందువల్లనో రాష్ట్ర ప్రభుత్వం ఆ విషయాన్ని సీరియస్‌గా పట్టించుకోలేదు; మతకలహాలప్పుడు తప్ప ఆ అవసరమూ రాలేదు. మనిషి దూరను సందులేని వీధులతో, పద్మవ్యూహం వలె అల్లుకపోయిన పాతబస్తీపై ప్రభుత్వానికి అదుపులేదు. స్థానికంగా ఏర్పడివుండే ముఠాలే అక్కడ రాజ్యం చేస్తుంటాయి. పోలీసు వారి జోలికి పోరు; పాత బస్తీ పోలీస్ స్టేషన్లలో కానిస్టేబిళ్లనుంచి ఎస్‌ఐ, సిఐ స్థాయి అధికార్ల వరకు ఈ అరాచక శక్తులతో నిత్యసంబంధాలు నెరపుతుంటారని ప్రతీతి. వీరికి బదలీలు కూడా సాధారణంగా వుండవు.

ఇటువంటి సానుకూల పరిస్థితులుండబట్టే కాశ్మీర్ తీవ్రవాదులు హైదరాబాదు చేరుకున్నట్లున్నారు. వారి గురించి సమాచారం అంది జాగ్రత్తపడేలోగానే సమర్థుడైన యువ పోలీసు అధికారి కృష్ణప్రసాద్, మరొక కానిస్టేబిల్ హతమైపోవడం దురదృష్టకరం. తీవ్రవాదులున్నారని తెలిసీ ఆ ఐపిఎస్ అధికారి అంత అమాయకంగా ఎందుకు వారి తూటాలకు అడ్డునిలిచాడో అనూహ్యం. తగిన జాగ్రత్తలతో, పోలీసు బలగంతో వెళ్లివుంటే టెర్రరిస్టులు బోనులో చిక్కిన ఎలుకల్లాగా దొరికి పోయివుండేవారు. ఆ తర్వాత ఆ టెర్రరిస్టులు ధనికులను బెదిరించి, లక్షలు దోచి, కాశ్మీర్‌కు పారిపోను ప్రయత్నిస్తున్నారన్న వార్తలు వెలువడుతున్నాయి. పోలీసులు నగరమంతా తమకోసం గాలిస్తున్నారని తెలిసీ, బ్లాక్‌మెయిలింగ్ చేయగల్గుతున్నారంటే వారికి ఇక్కడ ఎంత బలమైన అండ వుందో మరి!

ఏది ఏమైనా ఆంధ్ర పోలీసులకు ఇదొక సవాల్ వంటి నూతన పరిణామం- టెర్రరిస్టులను మొదటిలోనే గుర్తించి, వారు బలపడక ముందే తుదముట్టించేందుకు లభించిన అవకాశం కూడా! తమ గూఢచారి వ్యవస్థ అసమర్థమైందన్న నింద మాపుకొని, రాజధాని నగరం నుంచి తీవ్రవాదులను తరిమివేయాలి. పౌరులలో విశ్వాసం కల్గించాలి. లేకుంటే, అసలే మతోన్మాదశక్తులు, అరాచక వాదులతో నిండిన భాగ్యనగరం తీవ్రవాదుల మకాంగా కూడా మారితే, దారుణమైన పరిస్థితులేర్పడుతాయి.

## నెల్లూరు ఉద్యమం

ప్రపంచ వ్యాప్త ప్రాచుర్యం పొంది, చరిత్ర సృష్టించిన నెల్లూరు సారా ఉద్యమం నీరుగారి పోవడం బాధాకరంగా వుంది. కొంపలు కూల్చే త్రాగుడు దుర్వ్యసనం నుంచి కొన్ని పేద కుటుంబాలైనా బాగుపడుతున్నాయనుకొనే సమయంలో, ఉద్యమ ఫలితాలు పేదల కొంపలార్పేవిగా పరిణమించడం దురదృష్టకరం.

సారావేలం పాటలు జరగక పోవడంతో దొంగసారా వ్యాపారం జిల్లాలో ముమ్మరంగా సాగుతున్నది. ప్రతి పల్లెలో స్మగ్లింగ్ సారాయి ప్రత్యక్షమౌతున్నది. దొంగసారా వ్యాపారాన్ని నీడవలె వెన్నంటి వుండే రౌడీఇజం, దుర్మార్గం ప్రబలుతున్నాయి. ఇప్పటికే జిల్లాలో రెండు మూడు చోట్ల సారా ఘర్షణల్లో రక్తం స్రవించింది. సులభంగా ధనం సంపాదనకు దొంగసారా దగ్గరిదారనే ఉద్దేశ్యంతో కొత్తకొత్త వారు బట్టీలు తెరుస్తున్నారు. మారుమూల పల్లెల్లోనూ కాపుడు సారా కాస్తున్నారు. టౌన్‌లలో ప్రతి వీధిలోను అమ్మకాలు జరుగుతున్నాయి. ఉద్యమం వల్ల త్రాగుడు తగ్గినట్లే కన్పించినా, అది చప్పబడగానే అంతకు రెండింతలుగా పెరిగిపోతున్నది. ప్రభుత్వం సారా నిషేధానికి ఉద్యుక్తమై, నిర్ణయం ప్రకటించే సమయంలోనే ఇటువంటి వాతావరణం ఏర్పడడం విచారకరం. సారాయి ఉద్యమాన్ని తన ప్రచారాయుధంగా మల్చుకొన్న 'ఈనాడు' దినపత్రికలోనూ ఉద్యమ వార్తలు తగ్గి, నాటుసారా వార్తలు అధికంగా కన్పడడమే ఈ పరిస్థితికి దర్పణం అనుకోవచ్చునేమో!

పరిమితమైన,స్వార్థపూరితమైన రాజకీయ లక్ష్యాలతో ఉద్యమంలో జొరబడి పెత్తనం స్వీకరించిన రాజకీయ వాదుల పుణ్యమే ఇది. సారాయి వ్యతిరేకా...లాష కల్గిన పల్లెప్రజలు, మహిళలు ఇప్పటికైనా ఈ వాస్తవం గ్రహించి ...మాన్ని తిరిగి తమ స్వాధీనంలోకి తెచ్చుకుని, మానసిక పరివర్తన ద్వారా త్రాగుబోతులను సంస్కరించేందుకు ప్రయత్నం చేయాలి; ...ణులకు తావివ్వక శాంతి పూర్వకంగా ఉద్యమం కొనసాగించాలి. లేకుంటే మొత్తం ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరౌతుంది.

## జమీన్‌రైతు

4.12.92

8 పేజీలు అణా

### నెల్లూరు నగరజ్యోతి

నెల్లూరులో గోడల మీద వ్రాయడం, వార్తలకు నిందలకు అధిక వ్యాప్తిని కలుగజేయుటం పద్మనాభయ్య ప్రారంభించి, కట్టువైనా ఆదర్శప్రాయంగా సాగించినాడు. తర్వాత సత్రం వద్ద వార్తల గోడకు ముత్తరాజా గోపాలు వారసుడయినాడు. పాపం ఆ బ్రహ్మచారి మిడి ఎండలో గోడ మీద జోరు చమటతో వ్రాసి ఆతురతతో మూగే జ్ఞానానికి తృప్తి గూర్చినాడు. ఆయన దినాలలో గోడకు మంచి స్టాండర్డు.

విశేషమేమిటంటే పత్రికలు చదివే వాళ్లు గూడ దీని పై వ్రాతలు చదువుతారు. ఇంకా దీని వ్రాతలు నెల్లూరు వారికి వేదాలంతటి ప్రమాణాలు. ఈ విధమైన న్యూస్ బోర్డు యే పట్టణంలో గూడ లేకపోవడమే కాకుండా యీ గోడకు మంచి గౌరవం ప్రతి చోట.

యిది వ్రాయడం లాభం లేని అరవ చాకిరి– ఇంకా విశేషమైన ప్రయాస గూడాను. దమ్మిడీ లాభం లేకుండా యిప్పుడు వ్రాసే ఇంద్రగంటి సుబ్రహ్మణ్యం గారి సేవకు నిజంగా ధన్యవాదాలే!

కాని, కొన్నిసలహాలు – యింతకు ముందు వారి వలెనే ప్రయాస అనక, ప్రజలు మూగే ముందు వ్రాస్తే – వ్రాసి, చదివే వారికి సౌకర్యం. ఆ గోడ ఇంత వరకు unpersonal గా, చేత విషయాలు మాత్రం ప్రకటించేది – కాని ఇప్పుడు హరి నాటకాల సినిమాల ప్రకటనలు, అనాయరు కిల్లిమేలు – యీయన జోష్యం మెరుగు – ఆమె పాలు పలచన – అని ఇట్లాంటి క్రింది తరగతి అడ్వర్‌టైజ మెంట్లకు పోటీయడం – ఆ గోడకు కళంకము – నీవు జేసే నిష్కామకర్మకు అపకీర్తి, గాబట్టి – గోడ Standard తగ్గనీయకుండా పట్టుకరావడం ఇంద్ర Gun.T. వారి బాధ్యత.

### వడ్ల కంట్రోలు

మన జిల్లాలో పండబొయ్యే వడ్లను గవర్నమెంటు పెరుక్కుంటుందని తహసిల్ దారుని అడిగి కోసి. వారిని

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

మందల వుంచుకోని మహసూలు చేయాలని – ఇంకా ఇట్టి నిరాధారపు కింవదంతులు జిల్లాలో ప్రాకి చాలా అలజడిని కలుగజేస్తున్నవి. నేషనల్ వార్ ఫ్రంట్ వారు ఇట్టి నీలాపనిందల తొలగించే ప్రయత్నం చేయుట ప్రథమ ధర్మం.

రైతు మనవద్దికి పోను మిగిలి, అమ్మదగిన ధాన్యమునంతా ప్రభుత్వమే కొనుగోలు చేయవలయునని యోచించు చున్నదని వినికిడి – ఇదే నిజమైన యిది రైతుకు మహోపకారము. లాభాలకు ధరలు పెంచే వర్తకుల నుండి బీదసాదా గూడ రక్షింపబడుతుంది. గింజకరవు తప్పుతుంది.

కాని మిగిలితే గాని పరాయిచోటికి ఎగుమతి కాకుండా గూడ చూడాలి.

### మునిసిపాలిటీ కంకరపోగులు

మునిసిపాలిటీ పని – పౌరులకు సౌకర్యం కూర్చడమే గాని, వారిని కష్టపెట్టడం కాదుగదా. రోడ్ల రిపేరుకు కంకర గుట్టలు తోలక తప్పదు గాని, అది ప్రజల రాకపోకలకు ఇబ్బందిగా వుండ కూడదు. ఈ మధ్య సన్నగొందులలో – ముఖ్యంగా ముత్తరాజా వారి వీధిలో బ్యాకౌట్ దినాలలో చీకటి మబ్బుదినాలలో చాలా మంది గుట్టల మీద పడి గాయపడినారు. ముందుది వాలలో 'అపాయము' అని తెలిపే ఎర్రదీపాలుండేవి. ఇప్పుడు అవి లేకుండా ప్రజలను కష్టపెట్టడం యెందుకో గోచరం కావడం లేదు. అది గాక ప్రజలకు కలిగే కష్టనష్టాలకు మునిసిపాలిటీ ఉత్తరవాది. మునుపు అన్నా సామయ్యర్ – ఇట్లాంటి గుట్ట మీద దీపం లేనందు వల్ల పడి, దెబ్బలు తిని, మునిసిపాలిటీ మీద దావా వేసి డిక్రీ పొందినాడు.

ఈ గుట్టలు ఇప్పుడు ఆచారి వీధిని అలంకరించి వున్నవి. అప్పుడే చాలా మంది పడి గాయాలతో బూతు బందు తిరుతూ పోతున్నారు. త్వరలో డేంజర్ లైటు పెట్టకపోతే గాయాలుదిన్న వారు దావాలు పడవేయాలని వున్నారు. కమీషనరు గారూ, ఇక మీ యిష్టం! అసలు నీవు కొంత స్తబ్బు మనిసివయ్యా!

# అయోధ్య సమస్యలో సత్య సాయిబాబా సయోధ్య సాధించాలి!

భక్తులకు దేవుడు. హేతు వాదులకు మానవతావాది; రాష్ట్రపతి, ప్రధాని సైతం తలవంచి నమస్కరించిన మహా పురుషుడు శ్రీ సత్యసాయి బాబా ఒక్కరే అయోధ్యసమస్య విషయంలో సయోధ్య చేయగల మహావ్యక్తి. డిశంబర్ 6 న జరిగే కరసేవను ఆపగల శక్తి బాబా ఒక్కరికే వుంది. మహమ్మదీయ భక్తులు, బి.జె.పి. ఆర్.ఎస్.ఎస్. నాయకులు బాబాను గౌరవిస్తారు. ఆయన యోచన మార్గాన్ని అంగీకరిస్తారు. సమన్వయ కర్తగా శ్రీ బాబా సయోధ్య చేస్తే ఆయన పేరు తరతరాలుగా నిలిచిపోతుంది.

నెల్లూరు – వాస్తు రామచంద్ర

### ప్రొహిబిషన్ గూర్చి మీరు మాట్లాడకండి

సారా వ్యతిరేక వుద్యమం పలుదారుల్లో నడిచింది. ప్రస్తుతం ప్రొహిబిషన్ పెట్టాలనే వరకు వచ్చి ఆగి వుంది. కొందరు ప్రజా ప్రతినిధులు ఈ సమస్యను గోరంతలు కొండంతలు చేసి ఏదేదో మాట్లాడుతున్నారు. అయ్యా, నాయకమ్మన్యుల్లారా పబ్లిక్ మీటింగులు, పేపర్లు ఉన్నాయి కదా అని దయచేసి నోరు పారేసుకోకండి. మీ ఆధ్వర్యంలో చిన్న సభ జరిగినా సంతర్పణ జరిగినా మందు– విందు లేని చోటుండదు. నాలుక పై నరంలేని ఈ నాయకులకు ఒక కథ గుర్తుకు తేవాలి. రామకృష్ణ పరమహంస దగ్గరకు తన బిడ్డకు వున్న బెల్లంతినే అలవాటు మాన్పించమని ఒక తల్లి వచ్చి అర్థించింది. స్వయంగా బెల్లం తినే అలవాటు వున్న పరమహంస గారు నాలుగు వారాలకు గాని ఆ బిడ్డకు మానమని సలహా ఇవ్వలేకపోయారు. ఏమని అడిగితే తన అలవాటును చెప్పి నాకున్న అలవాటును ఇంకొకరి చేత మాన్పించడమెట్లా ? అందుకే నేను మాని ఇప్పుడు మీబిడ్డకు చెప్తున్నాను అన్నారు పరమహంస. నాయకులారా ఈ కథలోని నీతిని మీరు తెలుసుకొని సారాయి

## జనవాణి

ప్రొహిబిషన్ గూర్చి మీరు తాగడం మానిన తరువాత మాట్లాడితే బాగుంటుంది.

– ఆవుల కొండయ్య

గూడూరు

### మంత్రాలకు అర్థం చెప్పాలి

హిందూ సమాజంలో వివాహానికి పౌరోహితులు మంత్రాలు చదవడం సాంప్రదాయం. మంత్రాలు చదవకుండా వివాహం జరపడం అనర్థంగా భావిస్తారు. ప్రస్తుతం కొంతమంది మాత్రమే ఈ ధోరణిని వ్యతిరేకిస్తున్నారు. పెళ్లి పీటలపై కూర్చొని వుండే పెళ్లి కొడుకు, కూతురు, ఇతర బంధువులకు ఈ మంత్రాలకు అర్థం తెలియదు. నేను చాలా మందిని మంత్రాలకు అర్థం చెప్పమని అడిగాను, నవ్వి -వూరుకొన్నారు. మరి కొందరు సంస్కృత భాషలో నిష్ణాతులైన వారిని అడగమన్నారు. ఎవరైనా దయచేసి మంత్రాలకు అర్థం చెబితే బాగుంటుంది.

– డాక్టర్ ఇ. రాజగోపాలరెడ్డి

నెల్లూరు

### ఇదండీ అమెరికన్ పోస్టల్ శాఖ ఘనత

అమెరికా అధ్యక్ష పదవికి జరుగుతున్న ఎన్నికలను పురస్కరించుకొని డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి శ్రీ బిల్‌క్లింటన్ గెలుస్తారని ఆయనకు అడ్వాన్సు శుభాకాంక్షల సందేశాన్ని పోస్టులో జూలై 17 న పంపాను. ఆగష్టు నెలలో ఆ కవర్ నాకు తిరిగి వచ్చింది. దాని పై 'రి టూర్ ఇన్ కమ్ను' అని వుంది. ఈ పదానికి అర్థం ఏమిటా అని ఆరా తీస్తే పై అడ్రసు దారుడు లేరు. అని తేలింది. ఏమిటండీ, అమెరికన్ పోస్టల్ శాఖ పనితనం. మనం మనదేశం లోని పోస్టల్ శాఖ నత్తనడక తీరును చూసి ఆశ్చర్యపోతుంటాం. అప్పటి ప్రతిపక్షపార్టీ అభ్యర్థి ఇప్పటి అధ్యక్షుడి అడ్రస్ తెలియదన్న అమెరికన్ పోస్టల్ శాఖ ఘనతను ఏ రీతిన వర్ణించాలో మరి.

– బి. కొండయ్య

కొరవ 8 పేజీ

## అరాచకపు ట్రాఫిక్‌లో ఈ అమాయక ప్రాణాలకు భద్రతేది?

[illegible] బొమ్మలు చూడారు కదా - ఆ రిక్షాల్లో కుక్కబడినవి కోడి పిల్లలు కాదు; కాన్వెంట్‌లకు పోయి వస్తున్న చిన్న పిల్లలు. ఒక రిక్షాలో 13 మంది. రెండవదానిలో పదహారు మంది పిల్లలు వున్నారు. అందులో ఒక రిక్షా కార్మికుడు అంత మందిని తొక్కలేక బలమంతా చిక్కబట్టి లాక్కుపోతున్నాడు. నెల్లూరు టవున్ రోడ్ల మీద నిత్యం ఉదయం సాయంత్రం కనుపించే దృశ్యాలివి. ఇటువంటివి ఒక రిక్షా కాదు, రెండు కాదు, ఎన్నో వుంటాయి. ట్రాఫిక్ రద్దీ ఎక్కువగా వుండే రోడ్ల మీద అంత మంది ముక్కు పచ్చలారని ముద్దు బిడ్డలతో రిక్షాలు పోయేటప్పుడు ఏ వాహనం ఏ కొద్దిగా తగిలినా ఏమవుతుంది? - నవ్వుతూ, కేరింతలు కొడుతూ, కబుర్లు చెప్పుకుంటూ ఆనందంలో మునిగి వుండే ఆ పసిప్రాణాలు అమాయకంగా హరీ అనవలసిందే కదా? ఆ దృశ్యాలు చూచినప్పుడంతా ఈ రచయితకు గుండె గుభేలు మంటుంటుంది.

# ఇంగ్లీషు చదువుల మోజు ప్రయివేటు స్కూళ్ల పంట!

రోజూ టవున్‌లో జరుగుతున్న ప్రమాదాలను చూస్తున్న తల్లిదండ్రులు తమ పిల్లల విషయంలో ఇంత రిస్కు ఎందుకు తీసుకుంటున్నారు? రిక్షా కార్మికుడు శక్తికి మించిన బరువును లాగి లాగి ఎందుకు వుసూరు మంటున్నాడు? కాన్వెంటు చదువుల మీద వున్న వెర్రి

## సింహపురి సమస్యలు

మోజు వల్ల తల్లిదండ్రులకు ప్రమాదాలు ప్రాణాపాయాలు మనసుకు రావడం లేదు; మరొకటి - రిక్షా కంటె సరిసైన రవాణా సౌకర్యం లేదు. రిక్షా కార్మికునికి పది పదిహేను మంది పిల్లలను వుదయం బడికి తీసుకపోయి, సాయంత్రం తీసుకవస్తే నెలకు నికరమైన ఆదాయం వస్తుంది రోజంతా బాడుగులు త్రొక్కవలసిన అవసరం లేదు. అందువల్ల శ్రమ అయినా అంత బరువును లాగుతున్నాడు. రిక్షాల్లో పిల్లలను పంపే తల్లిదండ్రులు చదువునే కాదు, వారి భద్రత విషయంలోనూ జాగ్రత్త తీసుకోవడం అవసరం.

ఈ మధ్య విద్యార్థినులు సైకిళ్ళూ బూనాలు వుపయోగిస్తున్నారు. టవున్ విస్తరించి దూరం ఎక్కువైనందువల్ల రవాణా ఖర్చుల పొదుపు కోసం మధ్యతరగతి వారికి, నెల జీతగాళ్లకు ఈ మార్గం తప్పని సరి. టవున్‌లో లారీలు,బస్సుల అరాజకపు రాకపోకల వల్ల నిత్యం ఎన్నో ప్రమాదాలు జరుగుతున్నాయి; ఎన్నో విలువైన ప్రాణాలు పోతున్నాయి. పొదుపు ముఖ్యమే; పిల్లల క్షేమం అంత కంటె ప్రధానం కదా! ఏ వేళకు ఏది జరగాల్నో, అది జరిగి తీరుతుంది అనే నిబ్బరం వుంటే మంచిదే! కాన్వెంట్లు, ఇంగ్లీషు మీడియం స్కూళ్ల వ్యామోహం ప్రజల్లో పెరిగి పోవడం; సర్కారు స్కూళ్లలో

## సర్కారు స్కూళ్ల అధ్వాన్నమై ప్రైవేటు బడులు పుట్టగొడుగుల్లా పుడుతున్నాయి!

చదువు చెప్పడం వ్యాపారం కావడంతో నర్సరీ మొదలు, డిగ్రీ వరకు ప్రయివేటు స్కూళ్లు, కాలేజీలు పుట్టగొడుగుల వలె పుట్టుకొస్తున్నాయి. సంఖ్యా పెరుగుదలతో బాటు వీటి జనాభా విస్ఫోటనం కూడా పరిమితులు దాటి పోతున్నది. నెల్లూరు, గూడూరు, కావలి వంటి టవున్‌లలోనే కాదు, పది మంది చదవుకునే పిల్లలున్న పల్లెటూరులో కూడా ఒక కాన్వెంటు వెలుస్తున్నది. నెల్లూరులో అయితే వీటి సంఖ్య వందలు కాదు, వేలల్లో వుంటుందేమోననిపిస్తుంది. అది ఇంగ్లీషు మీడియం గాని, తెలుగు మీడియం గాని ఒకటి రెండు ప్రయివేటు స్కూళ్లు లేని వీధి లేదంటే అతిశయోక్తి కాదు. ఈ స్కూళ్లు ఈ విధంగా శరవరంపరగా పెరిగిపోవడానికి నిరుద్యోగం కూడా ఒక కారణం. విద్యావంతులైన వారికి వుద్యోగం దొరకక, స్వతంత్ర జీవనానికి సొంత స్కూళ్లు వుత్తమ మార్గంగా వుపయోగ[illegible] పడుతున్నాయి.

ఇంగ్లీషు కాన్వెంట్లు, కాలేజి చదువులు పెరిగిపోవడంతో పల్లెటూళ్ల నుండి నెల్లూరుకు వలస నిరంతరాయంగా

కొరవ 9 పేజీలో

# రసాలు ఒలికించారు- ఆనంద భైరవులు పలికించారు!

డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిగారి అంతరంగం పొరల్లో ఆవిర్భవించిన అమృత వీచికలు 'బృందావన వీధికలు' అవి మమతల పందిళ్లు పెట్టి భావనా వివజాజాలను పూయించిన రేఖాచిత్రాలు. మనసు పొరలను, తనువు తెరలను దాటి పలికిన మధుర మహార్నాదాల సంపుటి. ఊహలు ప్రసవించిన అలల మీద కవితల పడవలో తేలిపోతూ నురుగు పూల బంతులను పల్కరిస్తూ తమ అనుభవాలను వకుళాభరణాల్లో మిళితం చేసి మోహనంగా, సరసంగా గానం చేస్తూ రసాలను ఒలికించారు; ఆనంద భైరవులను పల్కించారు ఈ రేఖా చిత్రాలలో గోపాల రెడ్డి గారు. ఆ అనుభవాలు, అనుభూతులు గమ్మత్తుగా, మత్తుగా మురిపించి మరిపిస్తాయి సహృదయ పాఠకులను.

ఈ బృందావన వీధికల్లో 13 సుగంధపూల బుట్టలున్నాయి. ఇవి కాక రెడ్డి గారి కవితా సంపుటాలను [illegible]ంచిన విమర్శ వ్యాసమాలలు [illegible]న్నాయి.

మొదటి వీధికలో రవీంద్రుని ఊర్వశి మధుర మంజు మంజీర నాదాలు పల్కిస్తూ, ఒయ్యారాలు ఒలికిస్తూ మనసు [illegible] కమవుతుంది. రాగోదయాలు, ర[illegible]యాలు, శిశిరం వేసవి వసంత శిశిరోదయాలు, పాటల దోసిళ్లు, పలుకుల పువ్వుల్లు అమృత స్నాత స్వాంతంలో [illegible] - రవీంద్రుని మార్మిక కవితలు. ఆ కవీంద్రుని హృదయంలో ఉద్భవించింది ఊర్వశి. రేఖా మాత్రమైన పురాణ ఊర్వశిని చూచి పెదవి విరిచి తాను అఖండంగా సృష్టించాడు ఆమెను - రవీంద్రుడు. రవీంద్రుని ఊర్వశి తారాపూర్ణ భావనా ప్రపంచం నుంచి దిగి వచ్చిన దివ్యసుందరి. నిండైన వెన్నెల్లో తడిసిమిలమిల మెరుస్తున్న సౌందర్యం ఈ ఊర్వశిది. ఆమె అందం దూపు గన్న ఉషస్సు చూపున్న మనుషుల కళ్లకు కాంతుల కళిక; రసగుళిక. "పరాశక్తి యొక్క సుందర ప్రకృతి ఊర్వశి. ప్రకృతి సౌందర్య శక్తికి వారిత్వము ఆపాదించెను రసలబ్ధుడగు రవీంద్రుడు. ఇట్టి మహదుదాత్త కల్పనకు ఆస్పదమై మధుర రసాబ్ధితో లబ్ధమైన కవితా సుందరి ఊర్వశి" అంటారు శ్రీ గోపాలరెడ్డి గారు. నిజమే - ఈ ఊర్వశి చిరంజీవి. ఆమె రసలుబ్ధ, రసలబ్ధ. ఈ లాంటి కళాత్మక వ్యక్తులను గూర్చి రవీంద్రుడే "In these large tracts of Nebulousness Art is Creating its Stars - Stars that are definite in their forms but infinite in their personality" అని అంటారు. రవీంద్రుని ఊర్వశి శ్రీ రెడ్డి గారి కలం మూలంగా మరికొన్ని హొయలు

కొరవ 9 పేజీలో

### గ్రంథసమీక్ష

**బృందావన వీధికలు**

రచయిత
డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

సమీక్ష
డాక్టర్ జె.వి. సుబ్బరాయుడు

వెల. రూ. 15.00

ప్రతులకు
(1) విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు, విజయవాడ
(2) బాలాజీ పబ్లికేషన్స్
తిలక్ రోడ్డు, హైదరాబాదు

## సణుగుడు

### విలేఖరుల పై దాడులలో తప్పు రెండు వైపులా వుంది!

నెల్లూరు జర్నలిస్టులు, తమపై జరుగుతున్న దాడుల నుంచి తమను రక్షించాలని కోరుతూ మొన్న శనివారం ఒక ప్రదర్శన జరిపారు. జర్నలిస్టులపై దాడులనేవి నెల్లూరుకు కొత్తకాదు కాని, అవిప్పుడున్నంత ప్రమాదకర ధోరణిలో ఎప్పుడూ లేవు. జర్నలిస్టుల పట్ల నెల్లూరు పౌరులు, రాజకీయ వాదులు ఎప్పుడూ గౌరవభావంతోనే మసలే వారు; మర్యాదగా చూసేవారు; ఏమి వ్రాస్తారో నని భయపడడం తప్ప. ఎందుకు వ్రాశావని నిలదీసే పరిస్థితులు చాలా అరుదుగా తప్ప ఎదురయ్యేవి కావు. జర్నలిస్టుల ప్రవర్తన కూడా బాధ్యతాయుతంగా వుండేది. వ్రాయనం చేత వచ్చినా, రాకున్నా, తాము వ్రా...

**డోలేంద్ర**

తమ పత్రికలో వస్తూందన్న నమ్మకం లేకపోయినా -నెల్లూరు పాత్రికేయులు ఎప్పుడూ హుందాగానే మెలగేవారు.

కొరవ 9 పేజీలో

# మహానటుడు దొరస్వామి!

దుష్యంతుని పాత్రకు ప్రాణం పోసిన మహానటుడు కందాళై శ్రీనివాస దొరస్వామి అని కళాప్రపూర్ణ మరుపూరు కోదండ రామరెడ్డి 30 తేది ఆంధ్రసభలో జరిగిన సంస్మరణ సభలో నివాళులర్పించారు. 1891 లో దొరస్వామి అయ్యంగార్ నెల్లూరు నాటక రంగానికి శ్రీకారం చుట్టి వంద సంవత్సరాలు నిండిన సందర్భంగా నెల్లూరు కళాసుధ సార్థకమైన ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది. వృద్ధ నటీ నటులిందర్నీ సన్మానించి వారందరినీ ఒక వేదిక మీద చూచే భాగ్యాన్ని కల్గించి, నాటక కళారాధనలో సింహపురీయుల శ్రద్ధాసక్తులు చావలేదని చాటింది కళాసుధ. అభినందనీయమైన కార్యక్రమమిది.

## నెల్లూరు సంగతులు

ఏ పాత్ర ధరించినా ఆ పాత్రకు అతికి పోయే మహానటుడు దొరస్వామి; దుష్యంతుని పాత్రకు ప్రాణం పోసి నట్లే శ్రీనివాస కళ్యాణంలో ఎరుకుల సానిగా, బొబ్బిలి యుద్ధంలో విధులు విమ్మే వాడుగా అమోఘంగా నటించి ప్రేక్షకుల మన్ననలు పొందడం దొరస్వామికే చెల్లింది. పుట్టుకతోనే నటనా లక్షణాలు పుణికి పుచ్చుకున్న వారికి తప్ప ఇతరులకి ప్రావీణ్యం సాధ్యం కాదు. ఆ రోజుల్లో, నాటక రంగంలో కొనసాగుతుండిన బ్రాహ్మణాధిపత్యాన్ని ఛేదించి శూద్రులకు అవకాశం కల్పించిన ఆదర్శ నటసామ్రాట్ కందాళై అని మరుపూరు కోదండ రామరెడ్డి తన ప్రసంగంలో శ్లాఘించారు. అటువంటి మహానటుని వద్ద వి.ఆర్. కాలేజీలో తాను

కొరవ 8 పేజీలో

# నెల్లూరు నలుచెరగుల్లో
## విమర్శకుడు

### పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీపసల పెంచలయ్య 5 తేది ఉదయం ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు వస్తున్నారు. అరోజంతా గూడూరు కార్యక్రమాలు; 6 తేది ఉదయం గూడూరు. మధ్యాహ్నం నెల్లూరు. సాయంత్రం శ్రీహరికోట; 7 తేది తడ; 8 తేది నెల్లూరు; అరాత్రికి ఛార్మినార్‌లోనే తిరుగు ప్రయాణం.

### పి. జనార్ధన రెడ్డి

కార్మిక మంత్రి శ్రీ పి. జనార్ధన రెడ్డి 5 తేది నెల్లూరు వస్తారు – ఉదయగిరిలో మాదాల జానకిరాం కార్యక్రమాలు; 6 తేది నెల్లూరులో ఐఎన్‌టియుసి సభ; రాత్రికి తిరుగుప్రయాణం.

### ఉపలోకాయుక్త

ఉపలోకాయుక్త శ్రీ మేనకూరు మోహనరామరెడ్డి ఈ రోజు, రేపు (4,5 తేదులలో) నెల్లూరు దర్గామిట్టలోని రోడ్లు భవనాల శాఖ అతిథి గృహంలో బసచేస్తున్నారు. ఫిర్యాదులు ఇవ్వదలచుకున్న వారు ఈ రెండు రోజుల్లో అక్కడ ఆయనకు అందజేయ వచ్చునని జాయింట్ రిజిష్టార్ తెలియజేస్తున్నారు.

### నెల్లూరు బంద్

నరుకూరులో రైల్వే గూడ్స్ షెడ్ కూలి పులిచర్ల నారాయణ హత్యకు ప్రతిస్పందనగా సారాయి ఉద్యమ కమిటీ 30తేది నెల్లూరు జిల్లా బంద్ పాటించింది. సారాయంగడి దగ్గర అమ్మకాల విషయంలో పేచీవచ్చి, సారా వ్యాపారి మనుషులు నారాయణను చంపారట. అతడు సారా వ్యతిరేక ఉద్యమంలో పాలుపంచుకున్న వాడు కాబట్టి, సిపిఎం పార్టీ శవ సంస్కారం దగ్గరనుంచి ఈ బంద్ వరకు ఘనంగా నిర్వహించి, శ్రద్ధాంజలి ఘటించింది.

బంద్‌రోజు మధ్యాహ్నం వరకు టౌన్‌లో అన్నీ బంద్ అయిపోయాయి. వాహనాలు తిరగలేదు. అంగళ్లు తెరవలేదు. ఆఫీసులు తీయలేదు. గూడూరు, కావలి, నాయుడుపేట, సూళ్లూరుపేట వంటి ప్రాంతాలలో కూడా బంద్ బాగా జరిగింది.

చీటికి మాటికి బంద్‌లు ప్రకటించి జనాన్ని చంపుక తినే క్రూరమైన సరదా మన రాజకీయ పార్టీలకు అలవాటు కావటం దురదృష్టకరం. దీని వల్ల ఎన్ని వేల మంది ప్రజలు ఎన్ని రకాలుగా ఇబ్బంది పడతారో, నష్టపోతారో వూహించలేము. బంద్ అని తెలియక జోన్‌లోకి ప్రవేశించి, ఎటూ కదలడానికి లేక, తినడానికి తిండి లేక అల్లాడిపోయిన వందలాది లారీల సిబ్బంది, టూరిస్టులకు ప్రయాణికులను చూస్తే మాత్రం నిజంగా బాధ కల్గిందా రోజు.

### జనార్ధన రెడ్డి ఇంట్లో మళ్లీ దోపిడీ

నెల్లూరు విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అడిషనల్ సూపరింటెండెంట్ శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి ఇంట్లో మళ్లీ దోపిడీ జరిగింది. కొండాయపాళెం గ్రామం సమీపంలో, ఇన్‌ఫెంట్ జీసస్ స్కూలు దగ్గర నిర్మానుష్యమైన ప్రాంతంలో వుంది, జనార్ధన రెడ్డి గారి ఇల్లు. ఐదేళ్ల క్రితం ఒక రాత్రి ఆయన ఇంటిపై బందిపోట్లు దాడి చేసి, దోపిడీ చేశారు. ఆ కేసు ఇప్పటికీ పరిష్కారం కాలేదు. తిరిగి 2 తేది రాత్రి మళ్లీ అదే ఇంట్లో దోపిడీ జరిగింది. అర్ధరాత్రి ఒంటిగంట సమయంలో పది మంది బందిపోట్లు ప్రహరీ గోడ దూకి లోపలకు వచ్చారట. తలుపు తట్టి, తలుపు తీస్తారా, లేక విరగగొట్టుకొని లోపలకు రమ్మంటారా అని దబాయించారట. అందరు ఒకేసారి కనబడే సరికి, వారిని ప్రతిఘటించడం అసాధ్యమని భావించి, జనార్ధన రెడ్డి గారే స్వయంగా తలుపు తీశారట. బందిపోట్లు దర్జాగా లోపలకు వచ్చి, ఆయన కోడలు మెడలోని నగలు, బీరువాలోని 5 వేల నగదు తీసుకుని వెళ్లారట. 8 మంది లోపల బీరువాలన్నీ వెతుకుతుంటే, ఇద్దరు మాత్రం బయట కాపలా వుంటారట. అందరూ విక్కర్లు వేసుకొని, ముఖానికి నల్ల గుడ్డలు కట్టుకుని వచ్చారు. దాదాపు 40 నిముషాల పాటు జరిగింది దోపిడి! సమయానికి రివాల్వర్ లేకపోవడంతో అడిషనల్ ఎస్‌పిగారు నిస్సహాయంగా ఈ దోపిడీని భరించవలసి వచ్చింది. ఆయన ఇంటి ప్రక్క వేరే ఇళ్లు లేవు. టౌన్‌కు దాదాపు ఆరు కిలోమీటర్ల దూరం. ఎక్కడి నుంచి తక్షణ సహాయం అందే అవకాశం లేదు.

జనార్ధన రెడ్డి గారికి ఆర్థికంగా కంటే, మానసికంగా బాధ కల్గించే దుర్ఘటన ఇది. బందిపోట్లు పట్టుబడతారనే నమ్మకం మాకే కాదు, ఆయనకూ వుంటుందని భావించలేము. మన పోలీసు సమర్థత ఎవరికి తెలియదు గనుక!

### బందిపోట్ల ముఠా పట్టుబడింది!

నెల్లూరు జిల్లాలో పలుదోపిడీలకు కారకులైన ఒక బందిపోట్ల ముఠాను పోలీసులు పట్టుకున్నారు. పీట్ల సుధాకర్



అనే మాజీ కానిస్టేబిల్ ఈ ముఠాకు నాయకుడు. కావలిని కొంత కాలం గడగడలాడించిన రౌడీ, కర్రెద్దుల జయపాల్ హత్యకేసులో ముద్దాయిగా జైలు పాలై, పెరోల్ మీద విడుదలై వచ్చి, ముఠా కట్టి, దోపిడీలు చేస్తుండేవాడట. ఇతడి ముఠాలో, పదకొండు మంది సభ్యులున్నారు. నెల్లూరులోను, బయట జరిగిన 15 దొంగతనాలతో సంబంధం వుంది. మొన్న సెప్టెంబరు 23 తేది పెరోల్ పై విడుదలైనాడట. ఈ రెండు నెలల్లోనే ఇన్ని నేరాలు చేశాడంటే ఆశ్చర్య పడాల్సిన విషయం. ఆ మధ్య ఓజిలి సెంటర్ వద్ద లారీలో పోతూ, పోలీసులు ఆపేసరికి ఎస్‌ఐ ఖాసింను కత్తితో పొడిచి పారిపోయారు. అప్పుడు దొరికిన ముఠా సభ్యులు ఇద్దరు ఇచ్చిన సమాచారం ఆధారంగా పోలీసులు అతడ్ని అరెస్ట్ చేశారు. టౌన్‌లోని బృందావనంలోని శ్రీ పి. జగన్మోహన రావు, కొండాయపాళెం గేటు దగ్గర, లక్ష్మీనగర్, తల్పగిరి కాలనీ, రామ్మూర్తి నగర్‌లలో జరిగిన దోపిడీలు వీరు చేసినవేనట. లక్ష రూపాయల దొంగ సొత్తు కూడా పట్టుబడింది. టౌన్ క్రైం సిఐ శ్రీ జగజ్జీవరాం ఆధ్వర్యంలోని పోలీసు బృందం వీరిని పట్టివేసింది. ముఠాలోని మిగతా సభ్యులు వీరూ - వెంకటేశ్వర రావు, తెల్ల నరసయ్య, దేవాంగుల చంద్రశేఖర్, పీట్ల మోహన రావు, డ్రైవర్ బాష, పోతరాజు జోసఫ్, జార్జ్, చేవూరు రంగారెడ్డి, కె. రాజారావు, బి. వెంకటేశ్వర్లు.



తన సంస్థ ఆర్జించిన లాభాలలో కేంద్రప్రభుత్వ వాటా 17కోట్ల 35 లక్షలను ప్రధాని పివికి అందజేస్తున్న 'ఇఫ్కో' ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రారెడ్డి.

### పోయిన ప్రాణం వస్తూంది!

శ్రీ పసల పెంచలయ్య సమాచార శాఖ మంత్రి అయ్యేసరికి ఇతర చోట్ల విషయం తెలియదు గాని, నెల్లూరు జిల్లాలో మాత్రం పత్రికలకు పోయిన ప్రాణం వస్తూంది! పెంచలయ్య గారి మొన్నటి పర్యటనలో పత్రికలకు సంబంధించి రెండు సభలు జరిగాయి. ఒకటి – చిన్నపత్రికల సంఘం సభ; రెండవది ప్రొగ్రెసివ్ జర్నలిస్టుల అసోసియేషన్. ఇది మాత్రం అసోసియేషన్ సభగా కాక నెల్లూరు కాలింగ్ పత్రిక 30 వ వార్షికోత్సవంగా జరిగింది. మంత్రి మొదలు ఈ రెండుసభల్లో పాల్గొన్న నాయకులందరూ చిన్న పత్రికలకు సహాయం చేస్తామని చెప్పారు. చేసినా చెయ్యక పోయినా వరహా అంతటి మాట!

పెంచలయ్య నెల్లూరు పత్రికలకు కొత్త వారు కాదు. డి.పి.ఆర్.ఒ. గా అన్నిటి జాతకాలు తెలిసినవాడే. అందువల్లనే కాబోలు నెల్లూరు జిల్లాలో రిజిస్టరైన పత్రికలు 290 వున్నట్లు ప్రభుత్వ లెక్కల్లో వుంటే పెంచలయ్య మంత్రి అయ్యా కాగానే 200 పత్రికల డిక్లరేషన్ రద్దు చేశారట. ఇక 90 మిగిలి వున్నాయి. ఇందులో ప్రాణం వుండే వెన్ని? చస్తూ బ్రతుకుతూ వుండేవెన్ని? జీవచ్ఛవాలెన్ని? పత్రికా నిర్వహణలో సాధక బాధకాలు, సమస్యలు, కష్టనష్టాలు ఎన్నోవుంటాయి. అవి నిర్వాహకులకు తెలుస్తాయి. కాని, బయట వారికి తెలియదు. అందువల్ల పై విధంగా ప్రశ్నించడం వుచితంగా వుండదు.

చిన్న పత్రికలు ప్రభుత్వాన్ని ప్రకటనలడగవచ్చు; ఇతర ప్రకటనలూ సేకరించుకోవచ్చు; పత్రిక బ్రతుకుకు ప్రకటనలే ప్రాణం కాబట్టి అది అవసరం. కాని పత్రికను పెట్టి నడప దలచినపుడు దానికి అంకితమై ఎన్ని అగచాట్లు పడియైనా క్రమం తప్పకుండా నడపగలిగేట్లుండాలి. జర్నలిజాన్ని పూర్తికాలపు వ్యాపకంగా తీసుకో గలిగిన వాడే అందులో దిగాలి. పత్రికను పత్రికగానే, చిన్నదైనా, ఎంత చిన్నదైనా గుర్తింపు పొందగలిగేట్లుండాలి. నీతులు చెప్పడం కాదు, హిత బోధ చేయడం మా వుద్దేశ్యం కాదు – ఈ హక్కు అర్హతలు రాజకీయ నాయకులవి. కాని పత్రికలకు ప్రసిద్ధి చెందిన నెల్లూరులో పత్రికల తీరుతెన్నులు, పరిస్థితులు చూస్తుంటే కలిగే ఆవేదన వల్ల వ్రాయవలసి వస్తున్నది. 90 పత్రికలున్నాయన్నారు; అందులో ఎన్నిక్రమంగా వస్తున్నాయి? ఎందుకు రాలేకున్నాయి? ఆ పాత్రికేయులు ఆత్మపరిశీలన చేసుకోవలసిన విషయం కాదా? ఇన్నిపత్రికలు సక్రమంగా రాగలిగితే,

ొరవ 6 పేజీలో

బాలాజీనగర్‌లో అదనపు టౌన్‌పోలీస్ స్టేషన్ భవన నిర్మాణానికి శంకుస్థాపన చేస్తున్న హోంమంత్రి ఎం.వి.మైసూరారెడ్డి, ఎమ్పీ మాగుంట సుబ్బరామిరెడ్డి, ఎమ్మెల్యేలు జె.కె.రెడ్డి, సుందరరామిరెడ్డి, ఎస్‌పి కృష్ణప్రసాద్.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ కొరవ

పాఠకులను దృష్టిలో పెట్టుకుని తెగలిగితే, పత్రిక కొని చదవగలిగేట్లు చేయగలిగితే నెల్లూరుకు ఎంత ఆనందంగా వుంటుంది! నెల్లూరుకు ఎంత ప్రతిష్టాకరంగా వుంటుంది? నమ్మండి నమ్మకపోండి- కొన్ని పత్రికల వారు ముఖ్యమంత్రి లేక మంత్రులు, నాయకులు వచ్చినపుడు పత్రికను ప్రచురించి, వాటిని కరపత్రాల వలె పంచుతూంటే తోలి జర్నలిస్టులుగా తల గొట్టినట్లు వుంటుంది. దాని వల్ల ఆ పత్రిక అంటే చిన్న అభిప్రాయం ఏర్పరడం తప్ప పత్రికకు వచ్చే లాభమేమిటి? బస్ పాస్‌ల కోసం పత్రిక తెస్తున్నారనే అభిప్రాయం అవమానకరం కాదా? ఈ ధోరణులకు స్వస్తి చెప్పి ప్రతిష్టాకరంగా పత్రిక తేవడం పత్రికాలోకానికంతా కీర్తిదాయకంగా వుంటుంది.

పత్రిక సక్రమంగా తేకుండా ప్రకటనలు కావాలంటే రావు; మంత్రులతో సభలు జరిపితే రావు. పత్రిక వ్యాప్తితో, విలువతో ప్రకటనలు పొందగలిగేట్లుండాలి. జమీన్‌రైతు చిన్న పత్రికల క్రిందకు రాదు అన్నారట చిన్నపత్రికల సంఘ అధిపతి. చిన్న పత్రికో పెద్ద పత్రికో, లాభసాటిగా జరుగుతున్నదో, దిన గండంగా వుందో నడిపే మాకు తెలుస్తుంది. అయినా జమీన్‌రైతు పెద్ద పత్రిక అనే అభిప్రాయం నెల్లూరు పత్రికల వారిలో, ఆర్థికంగా మూడు కాయలుగా వున్నదనే అభిప్రాయం ఇతరులలో ఏర్పడిందంటే, లోపలి పరిస్థితి ఎట్లున్నా, పత్రికలో ఆ లోపం కనపడకుండా, ఒక్క వారం తప్పకుండా 63 ఏళ్లుగా పత్రిక తెగలుగు తూందడం వల్ల నేగాని, జమీన్‌రైతు పెద్ద పత్రికైనందు వల్ల కాదు, ఆర్థికంగా స్థిమితంగా వున్నందు వల్ల కాదు. దీక్ష, పట్టుదల, శ్రమ జమీన్‌రైతు పెట్టుబడులు. ఆ పెట్టుబడులను ఆ పత్రికలు కూడా సంపాదించుకుంటే, అవి 'జమీన్‌రైతు' వలెనే నడచి తీరుతాయి.

సమాచార శాఖ మంత్రి శ్రీ పెంచలయ్య ప్రభుత్వ ప్రకటనల బడ్జెటులో 30 శాతం చిన్న పత్రికలకు కేటాయించామని చెప్పారు. అది వెంటనే అమలుకువచ్చేట్టు చర్యలు తీసుకోవలసిందిగా కోరుతున్నాము.

## కరసేవకు నెల్లూరు బృందం

అయోధ్య కరసేవకు నెల్లూరు నుంచి రెండు వేల మంది వరకు బయల్దేరారు. మొదట 7500 మందిని కదిలించాలని బిజెపి, ఆర్ఎస్ఎస్ నాయకులు తలపెట్టారు. ఈ రెండు సంస్థలలోని క్రియాశీలక కార్యకర్తలు కరసేవకు వెళ్లాలని లేదంటే, ఆ కార్యక్రమంలో పాలుపంచుకోవాలని ఉత్సాహపడే వారికి ఆర్థిక సహాయం చేయాలని ఆదేశించారట. కాని కదిలే కార్యకర్తల సంఖ్య రెండు వేలకు పరిమితై పోయింది. అయోధ్యలో మొహరించి వున్న సైనిక దళాల సంఖ్య, గతానుభవాలు, అక్కడి ఉద్రిక్త పరిస్థితులు తెలిసి కూడా ఇందరు వెళ్లక్కరం ఆశ్చర్యకరమైన విషయం. ప్రజల్లో ఎంతటి మూఢభక్తి, మతావేశం వుందో ఈ సంఖ్యే చెప్తుంది.

నెల్లూరు నుంచి పోయిన వారందరూ కరసేవలో పాల్గొన్నా, పాల్గొనకపోయినా క్షేమంగా తిరిగి రావాలని ఆశిద్దాం!

## కోవూరు లెక్చరర్‌కు డాక్టరేట్

కోవూరు ప్రభుత్వ జూనియర్ కాలేజి తెలుగు లెక్చరర్ శ్రీ టి.గురుస్వామి శెట్టికి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం పిహెచ్‌డి పట్టా ప్రదానం చేసింది! వరదరాజ రామాయణం - సాహిత్యానుశీలనం-అనే అంశంపై ఆయన సమర్పించిన పరిశోధనా పత్రంపై ఈ డాక్టరేట్ ప్రదానం చేశారు. కావలి డాక్టర్ జెవి సుబ్బారాయుడు ఆయనకు గైడ్‌గా వ్యవహరించారు. గురుస్వామి శెట్టి - రిటైర్డ్ తాసిల్దారు స్వర్గీయ సున్నావెంకటచలం అల్లుడు.

## అల్లూరులో బర్మా జాలర్లు

అల్లూరు మండలానికి చెందిన ఇస్కపల్లి జాలర్లు తెప్పలుపడి శ్రీ లంక తీరం తిరిగితే, బర్మా జాలర్లు ముగ్గురు తెప్పల పై కొట్టుకొచ్చి 30 తేదీ ఇస్కపల్లి తీరం చేరారు. వీరిని ఇస్కపల్లి జాలర్లు మంగళవారం అల్లూరు పోలీస్‌స్టేషన్‌కు చేర్చారు. 25 సంవత్సరాల లోపు వుండే ఈ ముగ్గురు యువకులు ప్రస్తుతం స్థానిక భాష అర్థం గాక బిక్కు బిక్కు మంటున్నారు. తమకు ఏమైనా కావాలంటే సైగల ద్వారా చూపుతున్నారు. రెవిన్యూ శాఖ ఇస్తున్న రేషన్ బియ్యాన్ని మట్టి పాత్రల్లో ఉడకేసుకొని తింటున్నారు. ఎక్కడో దూర ప్రాంతం నుంచి విధి వంచించి వచ్చేసాము; ఎలా తిరిగి తమ దేశానికి చేరుతామన్న బాధ వీరి ముఖాల్లో ప్రస్ఫుటంగా కనపడుతుంది. చాలీ చాలని భోజనం, వంటిని దాచని వస్త్రాలతో అత్యంత దుస్థితిలో వున్న వీరిని చూస్తే కఠిన హృదయమైనా ద్రవించక మానదు.

## వెంకటగిరిలో వైఎస రాజకీయం

జనార్ధన రెడ్డి పై తన కక్ష తీర్చుకొను డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి వెంకటగిరి రాజకీయాలను కలుషితం చేస్తున్నారు. చీమ చిటుక్కుమంటే చాలు- ఆయన తండ్రి వైఎస్ రాజా రెడ్డి మందీ మార్బలంతో జీపుల కన్వాయ్‌తో, తుపాకులు, తూటాల పట్టీలు తగిలించుకున్న అంగరక్షకులతో వెంకటగిరిలో దిగిపోతున్నారు. గొట్టెరు వరద బాధితుల పరామర్శ అట. మొన్న 29 తేది వచ్చారు. జనార్దన రెడ్డి వెంకటగిరిని పట్టించుకోవడం లేదని నిందించారు. తమ పట్ల ఆయనకంత ప్రేమ ఎందుకు కల్గిందో ఆ బాధితులు తెలుసుకోలేరా? తమ జిల్లా ఎల్లలుదాటి రాజకీయం చేయగల్గిన స్థాయి తమకుందని రాజారెడ్డి గారు భావిస్తే - పొరుగునే వున్న కర్నూలులో అంతకంటే పెద్ద నష్టం జరిగింది కదా? తుంగభద్ర బాధితులను ఎందుకు పరామర్శించలేదు?

ఇటువంటి కుట్రమయమైన రాజకీయ స్వరూపాన్ని గ్రహించలేని అమాయకులు కాదు - వెంకటగిరి పౌరులు; రాజారెడ్డి గారిది వృధా శ్రమే!

## ముఠా దొరికినా దోపిడీలు ఆగలేదు

దోపిడీ ముఠా పట్టుబడిందనే సంతసాన్ని అపహాస్యం చేస్తూ టౌన్‌లో గతవారం పదిరోజులుగా దోపిడీలు, దొంగతనాలు విపరీతమై పోయాయి. ఈ లెక్కన నెల్లూరులో ఎన్ని ముఠాలు పనిచేస్తున్నాయో, పోలీసులు వారిని పట్టుకొని, పౌరులకు రాత్రి పూట భయరహిత నిద్రను ఎప్పుడు ప్రసాదిస్తారో దురూహ్యంగా వుంది.

గతవారం రోజులుగా ఏసినగర్ పరిసర ప్రాంతాలలో 12 దొంగతనాలు జరిగాయి. సిగ్గు చేటైన విషయమేమిటంటే వీటిలో 7 చోరీలు పోలీసు కాలనీ అని పిలువబడే నివాస ప్రాంతంలో జరగడం. ఈ కాలనీలో మొన్న 29 రాత్రి రమణయ్య అనే బేల్దారి మేస్త్రి ఇంటిపై పడి, తలుపులు విరగొట్టి లోపలకు వచ్చి, 40 వేల విలువజేసే నగలు, నగదు దోచుకున్నారు. ఇంత జరిగినా ఇంట్లోని వారికి మెళకువ రాలేదట - విచిత్ర పడాల్సిన విషయమిది. పోస్టల్ కాలనీ కూడా ఆ చోరులకు స్వర్గంగా వుంది. కిటికీ గ్రిల్స్ తొలగించి, లోపలకు వచ్చి, చడీచప్పుడు లేకుండా, ఇళ్లలోని వారికి అలికిడి తెలియకుండా చోరీ జరిపే ఒక నేర్పరి ముఠా ఈ కాలనీని తన స్థిర నివాసం చేసుకున్నట్లుంది.

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ దగ్గర 1 తేది రాత్రి పెద్ద దోపిడీ జరిగింది. ఫ్యాక్టరీ ఉద్యోగులు శ్రీహరి నారాయణ, ఆనంద రావుల ఇళ్లలో 22 సవర్ల నగలు, 4 వేల డబ్బు దోచుకున్నారు. తలుపులు పగులకొట్టి లోపలకు వచ్చి, ఇళ్లలోని వారి కాళ్లు చేతులు కట్టిపడేసి, తీరిగ్గా దోపిడీ జరిపారు. చక్కెర ఫ్యాక్టరీ ఆవరణంలోని క్వార్టర్లు, అడవిలో వున్నట్లుంటాయి. చుట్టు ప్రక్కల జన సంచారం వుండదు. గొంతు చించుకొని అరచినా ఎవరికీ వినపడదు. ఇది వరకు ఒకసారి కూడా ఈ క్వార్టర్లలో దోపిడీ జరిగింది.

మొత్తం మీద జిల్లాలో, టౌన్‌లో కూడా దోపిడీల నివారణలో పోలీసు వైఫల్యం చెందుతూంది. రాత్రి పూట విడుదల లేకుండా పహరా తిరుగుతున్నా, నాగబంద్‌పేరిట నేషనల్ హైవే సమస్తం గాలింపు జరుపుతున్నా, ఎక్కడో ఒక చోట వారి కళ్లు కప్పి బందిపోట్లు తమ పని కానిచ్చేస్తున్నారు. నెల్లూరు నుంచి మద్రాసు పోయే లోపల రాత్రి సమయంలో 3 చోట్ల చెకింగ్ జరుగుతున్నది. అర్ధరాత్రి దాటిన సమయంలోనూ పోలీసు జీపులు గస్తీ తిరుగుతున్నాయి. సగం మంది పోలీసు అధికారులకు నిద్ర కరువై పోయింది. అయినా దోపిడీలు ఆగడం లేదంటే, మరింత ఆధునిక శాస్త్రీయ మార్గాలలో దొంగలపై యుద్ధం ప్రకటించడం అవసరమేమో అధికారులాలోచించాలి!

## డైలీ లాటరీల రద్దు

పేద, మధ్యతరగతి ప్రజలను ఆర్థికంగా నిర్వీర్యులను చేస్తున్న డైలీలాటరీలను నిషేధించాలన్న కృత నిశ్చయంతో ప్రభుత్వమున్నట్లు రాష్ట్ర హోంశాఖ మంత్రి డాక్టర్ ఎం.వి. మైసూరారెడ్డి చెప్పారు. 3తేది టౌన్‌లో వివిధ కార్యక్రమాల్లో పాల్గొనను వచ్చిన మంత్రి మధ్యాహ్నం సోమశిల వసతిగృహంలో విలేకరులతో మాట్లాడారు. రాష్ట్ర ప్రభుత్వం ఏ లాటరీని నిర్వహించక పోయినా, పలు రాష్ట్రాల లాటరీ టిక్కెట్లు ఇక్కడ అమ్ముడు పోతున్నా చర్యతీసుకోవడం లేదనడం నిజంకాదని పలు రాష్ట్రాలు లాటరీలను వివిధ సాంఘిక సంస్థల సహాయార్థమని ప్రచారం చేసుకొంటున్నాయని; డైలీ లాటరీ టిక్కెట్లను రోజుకో పేరు పెట్టి విక్రయిస్తూ చట్టాన్ని సులభంగా మోసగిస్తున్నాయని, వీటిపై క్షుణ్ణంగా దర్యాప్తుకు ఆదేశించానని రాష్ట్రంలో టిక్కెట్లు అమ్మేందుకు గడువు ముగిసిపోయిన 8లాటరీల గడువు మళ్లీ పెంచలేదని వివరించారు. ఎప్పుడో లాటరీలను నిషేధించేవాళ్లం; మహారాష్ట్ర ప్రభుత్వం వైఖరివైఖరిపై సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు తోపాటు, ఇటీవల లాటరీలు నిషేధించానని చెబుతున్న మధ్యప్రదేశ్ ప్రభుత్వాల వివరణలు పరిశీలించాకే తుది నిర్ణయం తీసుకొంటామని మంత్రి స్పష్టపరిచారు. అదేవిధంగా కోకొల్లలుగా పుట్టుకవస్తున్న చిట్‌ఫండ్ కంపెనీలు, ఫైనాన్స్ కార్పొరేషన్ల విషయమూ పరిశీలిస్తున్నట్లు చెప్పారు.

జిల్లాలో పెరిగిపోతున్నదోపిడీల విషయం తనదృష్టికి వచ్చిందని కడప, నెల్లూరు, ఒంగోలు జిల్లాలలో జరుగుతున్న దోపిడీలు అరికట్టేందుకు 'మా సివ్‌హంట్' అనే ప్రత్యేక బృందం ఒక సి.ఐ.డి. డి.ఐ.జి. నేతృత్వంలో ఇప్పటికే పని ప్రారంభించిందని తెలిపారు. రాష్ట్ర వ్యాప్తంగా స్థాయి పెంచిన 95 సర్కిల్ పోలీస్ స్టేషన్లలో జిల్లాలోని కలిగిరి, బుచ్చి, నాయుడుపేట ఉన్నట్లు చెప్పారు. ఇటీవల కొందరు సంఘ విద్రోహ శక్తుల దాడిలో తీవ్రంగా గాయపడ్డ కావలి ఆంధ్రప్రభ విలేకరి రామ్మోహన్ హత్యాయత్నం కేసును సి.బి.సి.ఐ.డి. అధికారిచే దర్యాప్తుకు మంత్రి తక్షణం ఆదేశాలిచ్చారు. నెల్లూరు పోలీసుల అక్రమ నిర్బంధానికి గురైన ఈగా శ్రీనివాసులు అనే వ్యక్తి విషయంలో పోలీసు అధికారులను వివరణ అడగనున్నట్లు చెప్పారు. హైదరాబాదులో ఎ.ఎస్.పి.ని చంపివేయడంలో ఎల్.టి.టి.ఇ సంస్థ ప్రమేయమున్నట్లు తమశాఖ అనుమానిస్తున్నదని అభిప్రాయపడ్తూ; రాష్ట్రంలో అదనంగా 10వేల కానిస్టేబుళ్లు, 15 సబ్ డివిజన్ల సిబ్బందిని నియమిస్తున్నట్లు చెప్పారు. ప్రభుత్వ విప్, సర్వేపల్లి శాసన సభ్యుడు శ్రీ సి.వి. శేషారెడ్డి కూడా మంత్రి వెంట వున్నారు.

## లాటరీ నిషేధాన్ని కోరుతూ నిరాహార దీక్ష

మధ్యతరగతి ప్రజల జీవితాలతో చెలగాటమాడుతున్న డైలీ లాటరీలను నిషేధించాలని కోరుతూ జగదీష్ యువశక్తి సంస్థ అధ్యక్షుడు పంచాక్షరి శివకుమార్ 1తేది గాంధీ బొమ్మవద్ద ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు. దీక్షకు పలు ప్రజా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు మద్దతు ప్రకటించాయి. మూడో రోజుకు చేరుకొన్న దీక్షకు మద్దతుగా శుక్రవారం పలువురు రిలే నిరాహార దీక్షకు ఉపక్రమిస్తున్నట్లు సంఘసేవకుడు ఆచార్య పి.సి.రెడ్డి తెలియజేస్తున్నారు.

# ఎన్టీఆర్‌కు డబ్బంటే చేదా?

డబ్బుకోసం నటించడమనేది నా దృష్టిలో ఘోరమైన అపరాధం. 71 సంవత్సరాల వయస్సులో నేను డబ్బు సంపాదించి ఏం చేసుకుంటాను?" అన్నారు ఎన్.టి. రామారావు "మేజర్ చంద్రకాంత్" చిత్ర ప్రారంభోత్సవ సమయంలో; తన 30 ఏళ్ల నట జీవితంలో 321 చిత్రాలలో నటించి, విపరీతమైన ఆర్జనతో ఎన్నో సామ్రాజ్యాన్ని నిర్మించుకోవడం ధనం మీద వ్యామోహంతో కాదా? రాజకీయ నాయకులకు ప్రజల చెవుల్లో పువ్వులు కన్పిస్తుంటాయేమో. అటువంటి మాటలు మాట్లాడటానికి! డబ్బు మీద వ్యామోహం లేని వారికి పదవీ వ్యామోహం మాత్రం ఎందుకు ?

ఆయన ఆ సందర్భంలోనే "రాజకీయాలలో ఉన్నప్పుడు నటించకూడదనే విమర్శ అర్థరహితం. రాజకీయ కార్యక్రమాలు సాగుతూనే ఉంటాయి. నటన కూడా సాగుతూనే ఉంటుంది" అని అనడం తెలుగుదేశం సభ్యులు పలువురికి విస్మయం కల్గించింది. ఎప్పటికప్పుడు సినిమా నటనకు స్వస్తి చెప్పబోతున్నట్లు ప్రకటనలు ఇస్తూ వచ్చిన ఈయన రెండు గుర్రాల మీద స్వారీ చేస్తానని స్పష్టంగా చెప్పడంతో తెలుగుదేశం సభ్యులకు కలవర పడుతున్నది.

## సారా పై పోరాటం

సారా నిషేధాన్ని ప్రబోధించే మహిళామేలుకో అనే తమిళ చిత్రం తెలుగులోకి డబ్ అయింది. దాదాపు అటువంటి ఇతివృత్తంతోనే తమిళనాడు ప్రభుత్వం 85 లక్షల వ్యయంతో నిర్మించిన "నింగ నల్లా ఇరక్కణుం" చిత్రం తమిళనాడులో విడుదలైంది. తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత కనిపించే ఈ చిత్రాన్ని తెలుగులో డబ్ చేయాలని కొందరు నిర్మాతలు ప్రయత్నిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ఇలాంటి చిత్రాన్ని నిర్మించవచ్చు కదా?

వినేవారి చెవుల్లో, పువ్వులుంటాయనా వీరి నమ్మకం?

## బాపు రమణల "నా మాటే వేదం"

సి.ఎల్. నరసారెడ్డి సమర్పణలో జి.వి.యస్. క్రియేషన్స్ నిర్మించే "నా మాటే వేదం" చిత్రంలో సుమన్ ప్రధాన పాత్రధారి. రచన: ముళ్లపూడి వెంకట రమణ; స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: బాపు.

## నిర్మాతల హడావిడి

జనవరి నెలలో సంక్రాంతి కానుకగా చిత్రాలు విడుదల చేస్తే వసూళ్లు బాగా ఉంటాయని లోగడ దాఖలాలున్నాయి. ముఖ్యంగా డిసెంబర్ 31 లోగా చిత్రాలకు సెన్సార్ చేయిస్తే, సంపాదించుకుంటాయి. అందుచేత, చిత్రరంగంలో డిసెంబరంతా హడావిడి, హంగామా కనిపిస్తుంది. కొందరు ఒకటి రెండు సన్నివేశాల చిత్రీకరణ మిగిలి ఉన్నా - అంతటితోనే స్వస్తి చెప్పి, నెగటివ్ కట్టింగ్‌కు, రీ రికార్డింగ్‌కు తొందర పడుతున్నారు. ఫలితం- దైవా ధీనం!

బృందావనంలో రాజేంద్రప్రసాద్, అంజలీదేవి

# దాసరి గారూ, ఎందుకీ తిప్పలు?

చిత్ర ప్రారంభోత్సవాల నుంచి శతదినోత్సవ కార్యక్రమాల వరకు పిలిస్తే చాలు హాజరయ్యే వ్యక్తి దాసరి నారాయణ రావు. అందువల్లే ప్రతి పత్రికలోనూ ఆయన ఫోటోలు పదే పదే పుష్కలంగా పడుతూంటాయి. ఆయన కీర్తి కాంక్ష కొద్దీ అలా హాజరవుతుంటారని ఆహ్వానించే వారి అభిప్రాయం. అటువంటి కార్యక్రమాల ద్వారా తరచు దర్శనమివ్వడం వల్ల దిష్టి తగులుతుందని దాసరికి ఈ మధ్య ఎవరో సలహా ఇచ్చినట్లున్నారు; ప్రక్క క్షణంలోనే ఆయన ఇటుపైన అలాంటి ఫంక్షన్లకు హాజరవనని పత్రికా ముఖంగా ప్రకటించేశారు; ఈ ఇండస్ట్రీలో సెంటిమెంట్లు అన్నవి లేవనీ, అందరూ కమర్షియల్ మెంటాలిటీతో వ్యవహరిస్తారని ఆలస్యంగా తాను గుర్తించినట్లు, అందుకే చిత్ర పరిశ్రమలోని వారు పిలిచిన ఏ కార్యక్రమానికీ ఇటుపైన హాజరు కాబోయేది కాకూడదని నిర్ణయించుకొన్నట్లు ప్రకటించారు దాసరి. ఆయన రాక పోతే ఎవరికి నష్టం? ఇంతకీ, ఆయనకి సెంటిమెంట్స్ లేవా? ఆయనది కమర్షియల్ మెంటాలిటీ కాదా? అని ఆయన్ని తరచు ఆహ్వానించే తోటి దర్శక నిర్మాతలు నలుగురైదుగురు బాధతో వ్యాఖ్యానించారు. ఇలాంటి స్టేట్‌మెంట్లు ఇవ్వకుండానే ఆయన సినిమా ఉత్సవాలకు హాజరవకుండా తప్పుకోవచ్చు కదా? అన్న వారు కూడా లేక పోలేదు.

నవ్వు సంగతేమో గాని, బూతు మాత్రం దండిగా వుంది!

# ఏంటి బావా, మరీను !

ఈ మధ్య తెలుగు సినిమా నటులు, దర్శకులు, నిర్మాతలు తాము సమాజంలోని లోటుపాట్లను ఎత్తి చూపుతూ, చెడుకు సమాధి కడుతూ మంచికి పట్టంకట్టే చిత్రాలు తీస్తున్నామని ప్రకటనలు గుప్పిస్తున్నారు. కాని, తాము తీసే సినిమాల్లో నానా రకాల చండాలపు పనులు, పద్ధతులు, సంస్కృతులను కళ్లకు కట్టినట్లు చూపిచిత్రం చివరన 'శుభం' వేసినట్లు మంచి సందేశాన్ని ఎక్కడో వడీ చప్పుడు లేకుండా చూపి సరిపెట్టుకొంటారు. అవి ప్రేక్షకుల బుర్రలపై ఏ మాత్రం ప్రభావం చూపుతాయో తెలియదు గాని చెడు మాత్రం నషాలానికిఅంటుతున్నది. ఓ మోస్తరు హాస్య చిత్రాలను తీసే రేలంగి నరసింహారావు తీసిన తాజా చిత్రం 'ఏంటి బావా మరీనూ' కూడా ఈ కోవకు చెందిందే. మరదళ్లలతో సరసమాడే బేవార్సు హక్కు బావలకు వుంటుందట; కాని అది శృతిమించ కూడదని దర్శకుడు టైటిల్స్‌లో ప్రకటిస్తాడు. సన్నివేశాలను సున్నితంగా తీసుకోమని ఓ వంక చెబుతూనే బావ మరదళ్ల సాన్నిహిత్యాన్ని వక్ర మార్గాన చిత్రీకరించాడు. మళ్లీ నీతి చెబుతున్నానని బుకాయింపు; దానికి ఇంకో ముగింపు. హాస్యాన్ని సృష్టించాలని చేసిన నానా అపభ్రంశపు ప్రయత్నంలో మనుషులకు తోకలు మొలుస్తాయి; డాక్టరమ్మ కాంపౌండర్‌తో రికార్డు డ్యాన్సులు చేస్తుంది. ఇక ద్వంద్వార్థపు మాటలు, చేష్టలు కోకొల్లలు. హరీష్ త్రివేది

చిత్రసమీక్ష

* * *

అల్లూరు రహీం

మూలకథను నానా మెలికలు త్రిప్పి మొత్తానికి నీతిని చెప్పలేకపోయినా మరదళ్లను కార్లలో ఎక్కించుకొని గేర్లు ఎలా మార్చాలి, ఐంతాట అంటూ రాయనలవి కాని చేట ఎలా విసరాలి, పెళ్లానికి గంతలు కట్టి సరసాలెలా ఆడాలన్న విషయాలు మాత్రం భావిభారత 'బావ'లకు చక్కగా నేర్పుతుంది చిత్రం. నెలలోగా సినిమాను పూర్తి చేసి రీళ్లు చుట్టేస్తాననే ఈ చిత్రదర్శకుడు రీరికార్డింగ్ పై శ్రద్ధ చూపించక పోవడం వల్ల కొన్ని చోట్ల వినిపించక పోవడం, మరికొన్ని సన్నివేశాలలో కర్ణకఠోర శబ్దాలతో చెవులు తూట్లు పడడం జరిగింది. అదే విధంగా ఎడిటింగ్ కూడా.

కథలోకి వస్తే సహకార బ్యాంకు వుద్యోగి శ్రీరామ్ (నరేష్) సీత (శృతి) దాంపత్య జీవితం అన్యోన్యంగా సాగిపోతూంటుంది. ఆ సమయంలో పై చదువులు చదువుకునేందుకు సీత సోదరి ప్రేమ (సింధూజ) తన అక్క ఇంటికి వస్తుంది. బ్యాంక్ మేనేజర్ (మల్లికార్జున రావు) తప్పుడు సలహాతో శ్రీరామ్ మరదలితో సరసమాడనారంభిస్తాడు. బావ ఎన్ని ఎబ్బెట్టు చేష్టలు చేస్తున్నా సరదా అని సర్దుకొనే ప్రేమలో బావ మరీ ఒక సారి చేసిన వెకిలి చేష్ట మార్పు తీసుకొచ్చి ఆలోచింప చేస్తుంది. ముల్లును ముల్లుతోనే తీయాలని, శ్రీరామ్ ఆటకట్టించను తన పెద బావ గోపాలంను (గిరిబాబు) పిలిపిస్తుంది. అతను శ్రీరామ్‌లో మార్పు తెచ్చేందుకు సీతతో తనకేదో సంబంధమున్నట్లు ప్రవర్తిస్తాడు. ఆ చర్యలు శ్రీరామ్ లో అనుమానపు బీజాలు నాటుతాయి. ఆఫీసుకు పోకుండా అటక ఎక్కి కూర్చొంటాడు. ఆ ప్రవర్తనకు నొచ్చుకున్న సీత ఆత్మహత్య చేసుకోను ప్రయత్నించగా భార్య పై అపరిమిత అభిమానం చూపే శ్రీరామ్ అసలు విషయం తెలుసుకొని తప్పుకు చెంపలేసుకుంటాడు. మధ్యలో కాంపౌండర్ చిలక (బాబూమోహన్) పశువుల డాక్టరమ్మ (వై. విజయ), సక్కుబాయి (శ్రీలక్ష్మి) హాస్య సనకాలు

రవ 9 పేజీలో

# రోహిణి స్వతంత్ర జీవిగా మారింది!

బాలనటి నుంచి నాయిక స్థాయికి ఎదిగిన కొందరు యువతులకు ఎన్నో సమస్యలు ఎదురౌతూంటాయి. "నువ్వొక్కతే సంపాదిస్తూంటే, మా ఇంట్లో మిగతా వాళ్లు తింటూ కూర్చోవడమా! ఇలాగైతే నీ సంపాదన బాగా హరించుక పోతుంది. చివరికి నీ చేతికేమీ మిగలదు" అని ఆ నటికి కొందరు పని గట్టుకుని నూరి పోస్తూంటారు. దాంతో ఆ అమ్మాయి ఇంట్లో జమా ఖర్చుల లెక్కలు అడుగుతుంది. అదే ఆమెకూ - తల్లిదండ్రులకూ మధ్య అగాధాన్ని సృష్టిస్తుంది. చెప్పుడు మాటలు విని తమ కుమార్తె తమకు దూరమవుతుందేమోనని తల్లిదండ్రులు భయపడతారు. వీలయినంత మట్టుకు ఆమె డబ్బును వెనకేసుకోవడానికి ప్రయత్నిస్తారు. ఇది మామూలుగా జరుగుతుంటేదే. ఐతే, "శంకరాభరణం" వగైరా చిత్రాలలో బాల నటిగా నటించి, నాయిక హోదాకు ఎదిగిన రోహిణి ఇటీవల తల్లిదండ్రుల నుంచి తాను వేరైపోతున్నట్లు ప్రకటించింది. ఇందుకు మనస్పర్థలే కారణమని కూడా పేర్కొంది.

# శివారెడ్డి పద్యాలు

### సారా బందు

సారా బందును గూర్చివి
నే లేటితర బ్రాశ వార్ని తప్పు.
.. రేజ మళ్ళ గోతె
పారుకోడు కునగాంగి వడుకా మెరుకా!

హస్తినాపురంలో అరుగు బెట్టాలంటె
లో తంత ఖర్చు ప్లైమువేస్తు.
ఏరోప్లైయిను పుంటె యెగిరి దూకివాళ్లి
ప్లైమ్ మినిస్ట్రు సిగ్గిచేటు సెలవు!

**నరసమాంబ(రాజమండ్రి)**

కాబులారిపదితె కాంగ్రేసు కవి యూరు
చుట్టుపక్క జనము పట్టుకొని
యుల్లు జేర్చి వాళ్ళ, యూ రోజులవి వేరు
ఆ దినాలు వేరు అవోక తిరు!

ఆశ్రమాలు అంటె అదుర్ద ఆపేక్ష
నీతి నిష్టమెందు నిండుకుండ.
కానరారు మనకు కనిపేరు యికమీద.
నరసమాంబ చేరె పరమ పథము!!

### ప్రధానమంత్రి

అడిగేరెడ్డి పాపం అంటాయింతో యిచ్చి
అందరందరిచ్చి ఆదరించి
పట్టు పత్రికల్లో అమర్య జాగాను
పట్టి మాటొ నిజముస్తవరిల్లి!

### పొట్టబెట్టుకుంది

పొట్టబెట్టుకుంది పోలీసు లీడర్ని
మిలిటెంట్లు, కవిని నయనములతో
చూర్ల, వార్తపత్రికల్లో వస్తెవిన్న
వెవితో, యిదొక పెద్ద విక్కు ప్రాబ్లమ్!

---

## నెల్లూరు సంగతులు (4 పేజీ తరువాత)

ఇంగ్లీషు నేర్చుకోవడం మరువలేని మధురానుభూతి అని మరుపూరు వారు తన పాత జ్ఞాపకాలను నెమరు వేసుకున్నారు. సభాధ్యక్షుడు శ్రీ మాతభూషి సుందరాచారి ప్రసంగిస్తూ ఆ రోజుల్లో రంగనాయకుల పేటలో శ్రీ దొరస్వామి పోతుంటే ఆయన అందాన్ని చూచి ముగ్ధులయ్యే వారన్నారు. వేదం వెంకట రాయ శాస్త్రి స్ఫూర్తితో దొరస్వామి అయ్యంగార్ నాటక రంగ ప్రవేశం చేశారని శ్రీ సుందరాచారి చెప్పారు. శ్రీ యన్.యన్. కృష్ణమూర్తి నెల్లూరు నటుల చరిత్రను పుస్తక రూపంలో తేవడం సముచితంగా వుంటుందని సుందరాచారి వెలిబుచ్చారు. డాక్టర్ అమృత వాక్కుల శేషకుమార్ నెల్లూరు నాటక రంగంలో సంభవించిన మార్పులను విశదీకరించారు.

ఆఖరుగా రంగస్థల నటుడు, రాజకీయ వీరుడు శ్రీ దొడ్ల సుబ్బరామరెడ్డి, సరస్వతి నాట్య మండలి అధ్యక్షుడు శ్రీ పి. శంకరయ్య, తుఫాన్ నాటకంలో రాఘవ రెడ్డి పాత్రకు ప్రాణం పోసిన శ్రీ గాలేపల్లి రామయ్య, నెల్లూరు పెద్ద నుడికారాన్ని అద్భుతంగా ప్రతిబింబింప చేసిన తుఫాన్ నాటక రచయిత శ్రీ పులుగుండ్ల రామకృష్ణయ్య, వృద్ధ నటీనటులు శ్రీమతి జె. గంగారత్నం, శ్రీమతి కె. రత్నం, హార్మోనిస్ట్ శ్రీ కొణిక రామారావు, తబలా విద్వాన్ శ్రీ ధారా అబ్రహం, రూపశిల్పి శ్రీ టి. సుందరం గారలు వేద పఠనం మధ్య దుశ్శాలువలతో ఘనంగా సత్కరింప బడ్డారు. సభా ప్రారంభంలో శ్రీ ఆర్. పెంచలసింగ్ నటరాజపూజ చేయగా చివర్న కళాసుధ కార్యదర్శి శ్రీ వైద్యుల శ్రీనివాస రావు వందన సమర్పణ చేసారు.

### పి.సి.రెడ్డికి సన్మానం

ప్రజాసేవలో 50 ఏళ్లు పూర్తి చేసుకున్న ప్రముఖ సంఘ సేవకుడు ఆచార్య పి.సి.రెడ్డిని 29 తేది సాయంత్రం ఆయన 76 వ జన్మదినాన్ని పురస్కరించుకొని ఆంధ్రసభా భవనంలో పలు సంఘాలు సంయుక్తంగా సన్మానించాయి. 50 ఏళ్లలో శ్రీ రెడ్డి నడిపిన ప్రజా ఉద్యమాలు, సాహసోపేత ఘట్టాలు యువకులకు స్ఫూర్తి దాయకమని ప్రభుత్వ విప్, సర్వేపల్లి శాసనసభ్యుడు శ్రీ సి.వి. శేషారెడ్డి ప్రస్తుతించారు. జిల్లాకు అటువంటి నిస్వార్థ వ్యక్తి ఒకరున్నా చాలునని చెబుతూ; నెల్లూరు టౌన్ సమస్యల పరిష్కారానికి ఆయనకున్న అపరిమిత అనుభవాన్ని వినియోగించాలన్నారు.

వికలాంగులకు శ్రీ పి.సి.రెడ్డి కావేసిన సేవను కళాప్రపూర్ణ శ్రీ మరుపూరు కోదండ రామరెడ్డి వివరించారు. న్యాయవాది శ్రీ ఎం. సుందరాచారి అధ్యక్షించిన ఈ సభలో జర్నలిస్ట్ జి.వి. రమణయ్య, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, నేలనూతల కృష్ణమూర్తి, డాక్టర్ విజయకుమార్, సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, సి.సి. సుబ్బరాయుడు, వొమ్మిన సుబ్రహ్మణ్యం తదితరులు ప్రసంగించారు. చివరన పి.సి.రెడ్డి రచించిన పుస్తకం 'ఆవిష్కరణ' ను సభాధ్యక్షులు ఆవిష్కరించారు.

### ఎం.జి. బ్రదర్స్ బజాజ్ డీలర్ షిప్

ట్రాక్టర్లు, లారీలకు పరిమితమై వుండిన 'ఎం.జి.బ్రదర్స్' టాటా కార్లకు, ఇప్పుడు బజాజ్ స్కూటర్లకు వచ్చేసింది. నెల్లూరులో బజాజ్ డీలర్ షిప్ తమకు వచ్చిన సందర్భంగా వారు 29 తేది బ్రహ్మాండమైన సభ జరిపారు. ఆ సభ, ఆ హడావుడి ఎంజిబ్రదర్స్ స్థాయికి తగ్గట్లే వుండినాయి.

ఈ స్పీడు యుగంలో అనుకొన్న గమ్యాన్ని ఖచ్చితమైన సమయానికి చేరేందుకు స్కూటరే సరైన వాహనమని ఒంగోలు ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి అన్నారు. బజాజ్ నూతన డీలర్ షిప్‌ను ఆయన ప్రారంభించారు. పెరుగుతున్న జనాభా, నానాటికి ఇరుకై పోతున్న రోడ్లపై 'బజాజ్ సన్నీ' స్కూటర్ విజయవంతమవుతుందన్న ఆశాభావాన్ని వ్యక్తపరిచారు. నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి స్కూటర్ తొలుత నడిపి, సేల్ మార్కెట్ మొదలు పెట్టారు. డిప్యూటీ ట్రాన్స్‌పోర్ట్ కమీషనర్ శ్రీ ఎస్. సూర్యప్రకాష్, మాజీ ఎమ్మెల్సీ శ్రీ ఎం. గంగాధరం, డి.సి.సి. అధ్యక్షుడు ఆనంసంజీవ రెడ్డి, ఆంధ్రా బ్యాంకు అసిస్టెంట్ జనరల్ మేనేజర్ జె. శంకర రావు గుప్తా, ఎం.జి. బ్రదర్స్ యజమాని శ్రీగంగాధర్ తదితరులు పాల్గొన్నారు.

### నెల్లూరులో ఎయిడ్స్ డే

కేంద్ర సమాచార ప్రసార శాఖ ఆధ్వర్యంలో నడిచే ఫీల్డ్ పబ్లిసిటీ సంస్థ ప్రపంచ ఎయిడ్స్ దినాన్ని 1 తేది వేదాయపాళెంలోని గిరిజన కాలనీలో నిర్వహించింది. ఈ సందర్భంగా ఏర్పాటైన కార్యక్రమంలో ఫీల్డ్ పబ్లిసిటీ అధికారి శ్రీ ఎం. రామారావు మాట్లాడుతూ ఇటీవల జరిగిన అధ్యయనంలో మనదేశంలో ప్రతి వెయ్యి మందిలో ఐదుగురికి ఎయిడ్స్ వ్యాధి వున్నట్లు వెల్లడైందన్నారు. రక్త మార్పిడి వల్ల ఎక్కువ కేసులు నమోదు అవుతున్నట్లు పరిశీలనలో తేలిందని చెప్పారు. మరణానికి చేరువయ్యే ఈ వ్యాధిని దగ్గరకు రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరించారు.

### రోటరీ 'ఐ' ఫౌండేషన్ కళ్ల సేకరణ

ఇటీవల అపోలో ఆసుపత్రిలో దివంగతులైన శ్రీ సి.హెచ్. రామరెడ్డి రెండు నేత్రాలను ఆయన కుటుంబ సభ్యుల అనుమతితో సేకరించి మద్రాస్‌లోని శంకర నేత్రాలయానికి పంపినట్లు రోటరీ 'ఐ' ఫౌండేషన్ ఉపాధ్యక్షులు శ్రీ కె. బలరామరెడ్డి చెప్పారు. తమ సంస్థ భవిష్యత్తులో సేకరించబోయే కళ్లను రోటేరియన్ డాక్టర్ శివప్రతాప రెడ్డి చేత కార్నియల్ గ్రాఫ్టింగ్ చేయించి అంధులకు అమర్చాలని ఆశయమట. నేత్రదానం చేయాలన్న ఆకాంక్ష కలవారు సమ్మతి పత్రాలపై సంతకాలు పెట్టను బృందావనంలోని శ్రీ శివప్రతాప్ రెడ్డిని కలవమని కోరుతున్నారు.

### చంద్రహాస రెడ్డికి బ్యాంక్ అభినందన సభ

ఆంధ్రా బ్యాంకు డైరక్టర్‌గా నియమితులైన శ్రీ వై. చంద్రహాస రెడ్డి అభినందన సభ 29 తేది జెడ్. పి. పి. మీటింగ్ హాల్‌లో జరిగింది. బ్యాంకు ఆఫీసర్స్ యూనియన్ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. కోటేశ్వర రావు, శ్రీ రెడ్డి నెల్లూరు బ్రాంచ్ చీఫ్ మేనేజర్‌గా చేసిన సేవను ప్రస్తుతించారు. బ్యాంక్ అసిస్టెంట్ జనరల్ మేనేజర్ జె. శంకర రావు గుప్తా తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

---

## జనవాణి (3 పేజీ తరువాత)

### సర్వాంతర్యామి

రవి కాంచని చోటు 'జమీన్‌రైతు' కాంచునని చెప్పడం ఏ మాత్రం అసందర్భం కాదు. నేను సైన్యంలో పనిచేసే సమయంలో ఎక్కడో మారు మూలవున్న సియాచిన్ గ్లేషియర్ తవాంగ్ (అరుణాచల ప్రదేశ్), జోథ్‌పూర్, జలంధర్ వంటి ప్రదేశాలకు పత్రిక ఖచ్చితంగా చేరేది. అంత దూరంలో వున్నా ఒక్కసారి నెల్లూరు వార్తలు చదివితే నాకు జిల్లాలోనే వున్న అనుభూతి కలిగేది. ప్రస్తుతం నేను రిటైర్ అయి సికిందరాబాదులో వేరే వుద్యోగంలో చేరాను. కాని ఆనాడు ఈనాడు కూడా నా ఒంటరి తనానికి అనుంగు మిత్రుడు సర్వాంతర్యామియైన 'జమీన్‌రైతు' అని చెబుతాను.

లెఫ్టినెంట్ కల్నల్

— డాక్టర్ భాస్కర రెడ్డి
సికింద్రాబాద్

### వడ్డింపుల ప్రభుత్వం

కేంద్ర మంత్రిగా వుండిన శ్రీ కె. విజయభాస్కర రెడ్డిని, రాష్ట్రాభివృద్ధికి పార్టీ అభివృద్ధికి పాటుపడతారని అధిష్ఠాన వర్గం ముఖ్యమంత్రిని చేసి ఆంధ్రప్రదేశ్ పంపింది. ఆయనేదో పెద్ద మనిషనుకొంటె రాగానే ప్రభుత్వ వుద్యోగులకు కొన్ని రాయితీలు కల్పించి వారి మన్ననలు పొందారు. కాని అప్పుడాయన విద్యుత్, పాల ధరలు పెంచడంతో పాటు ఆర్టీసి ఛార్జీలు కూడా పెంచి మధ్యతరగతి సామాన్య ప్రజల నడుం విరగొట్టాలని చూస్తున్నారు. ముఖ్యమంత్రిగా జనాకర్షణ పథకాలంటూ ప్రభుత్వాన్ని దివాళా తీయించక్కర లేదు. పేదంగా వుండి పేద, మధ్య తరగతి ప్రజల అభివృద్ధికి పాటు పడండి. లేకుంటే మళ్లీ గతచరిత్రను పునరావృతం చేసిన ఖ్యాతి మీకు దక్కుతుంది.

— షేక్ మహబూబ్‌బాష
కలిచేడు

### దర్శిలో డిగ్రీ కాలేజి పెట్టండి

ప్రకాశం జిల్లా దర్శి మండలంలో 12 హై స్కూళ్లు 4 జూనియర్ కాలేజిలు వున్నా డిగ్రీ కాలేజి లేని లోటు పూర్చలేనిది. పూర్వపు తాలూకా అయిన దర్శి అన్ని రంగాల్లో బాగా వెనుకబడి వుంది. లక్షా 50 వేల మంది ప్రజలుండే ఈ మండలం లోని విద్యార్థులు పై చదువుల కోసం పొదిలి, మార్కాపురం, అద్దంకి, వినుకొండ, ఒంగోలు వంటి సుదూరప్రాంతాలకు పోవలసి వస్తున్నది. దీనివల్ల ఎందరో విద్యార్థులు చదువు మానేస్తున్నారు. ఈ సమస్యలను ఈ ప్రాంత రాజకీయ నాయకులు ఎప్పుడో మరచి పోయారు. ఇటీవల ఒంగోలు పార్లమెంట్ సభ్యులైన శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి తన నియోజక వర్గం పలు చోట్ల తనే స్వయంగా ప్రవేట్ కాలేజిలు ఏర్పాటు చేస్తున్నారు. దర్శిలో డిగ్రీ కాలేజి విషయంలోనూ ఆయన శ్రద్ధ చూపించాలని విజ్ఞప్తి.

— ఎన్. అప్పనా చార్యులు
దర్శి.

---

## పంచాంగము

### చంద్రగ్రహణము

తేది 9.12.92 బుధవారము రాత్రి 3.26 గంటలకు మొదలు 6.20 వరకు (తెల్లవారితే గురువారం) పూర్ణచంద్ర గ్రహణము. మృగశిర నక్షత్రమున జన్మించిన వారు గ్రహణము చూడరాదని ధర్మశాస్త్రము.

### ముహూర్తాలు లేవు

తేది 9 బుధవారము రాత్రి గ్రహణము కారణముగ 6తేది నుండి 12 తేది వరకుముహూర్తములు లేవు.

### డిసెంబరు తిథులు

మార్గశిర శుద్ధ

తే 5 శని ఏకాదశి రా.గ. 4.25 వ
తే 6 ఆది ద్వాదశి రా.గ. 5.20 వ
తే 7 సోమ త్రయోదశి రా.గ. పూర్తిగ
తే 8 మంగళ చతుర్దశి పూర్తిగ
తే 9 బుధ పూర్ణిమ పూర్తిగ

మార్గశిర బహుళ

తే 10 గురు పాడ్యమి రా.గ. 4.35 వ
తే 11 శుక్ర విదియ రా.గ. 3.50 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ

---

**జమీన్‌రైతు**
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

## నేలుగుడు

(4 పేజీ తరువాయి)

బదారేళ్ల క్రితం వరకు అర్హత లేని వారు పెళ్ళి విన్నర్లకు, డ్రింక్ పార్టీలకు జర్నలిస్టులు దూరంగా మసలేవారు; పిల్చినా రామని నిఖచ్చిగా చెప్పేవారు ఒకరిద్దరు భోజనానికి కక్కుర్తి పడడం తప్ప నిజాయితీగా ప్రవర్తించే వారు. అందువల్లే వారి జోలికి రావాలంటే రాజకీయ వాదులకు భయం. నక్సలైట్ల కిరాతకం వంటి ప్రమాదకర సంఘటనలలో, కలరాణి- చంద్రికారాణి వంటి సంచలనాత్మక కేసులలో, ఎన్నికల దౌర్జన్యాలలో, దొంగవోట్ల ముఠాల వెలికితీతలో, పోలీసుల అరాచకాలలో, అధికారుల అవినీతి భాగోతాలలో, మంత్రుల తప్పిదాలలో ఎంత ఘాటు వార్తలు వ్రాసినా ఏ నెల్లూరు పాత్రికేయుడూ బెదరింపులకు, దౌర్జన్యాలకు గురికాలేదు. అటువంటిది ఇప్పుడు తాడు బొంగరం లేని బడుద్దాయిలు కూడా విలేఖర్లను గద్దించి, దౌర్జన్యం చేయగల్గుతున్నారంటే అందుకు కారణం ఏమిటి? తప్పు కేవలం ఆ దుర్మార్గులదేనా? పాత్రికేయులది కాదా?

కావలి రామమోహన రావు దుర్ఘటన ప్రక్కన పెట్టండి; రామమోహన రావు నిజాయితీ పరుడైన జర్నలిస్ట్. కాని ఇతరత్రా జిల్లాలో జరుగుతున్న దాడులలో జర్నలిస్టుల తప్పులేదనుకోగలమా? దినపత్రికల పోటీ పెరిగిన తర్వాత వెయ్యి జనాభా లేని గ్రామంలో కూడా విలేఖరులు వెలిశారు. వృత్తి పట్ల అవగాహన, చిత్తశుద్ధి, గౌరవం, విశ్వాసం లేని వారెందరో పేనా పట్టుకుంటున్నారు. లైనుకు ఇంత అని రేటు పెట్టడం వల్ల సాధ్యమైనంత ఎక్కువ వ్రాసి, గిట్టుబాటు చేసుకోవడానికి తాపత్రయం పెరిగిపోయింది. ఈ పోటీలో వార్తకు విలువ పోయింది. పూర్తిగా వ్యక్తిగతమైన విషయాలు పొద్దున లేచేసరికి అచ్చులో దర్శనమిస్తున్నాయి. సామాజిక బాధ్యత విస్మరింపబడడంతో కొన్ని వార్తలు అనవసరంగా వ్యక్తులకు శూలాల వలె గుచ్చుకుంటున్నాయి. పెక్కు దినపత్రికలలో వార్తకు రేటు నిర్ణయమై పోయింది. అంకయ్య గౌడ్‌ను ఆకాశానికెత్తుతూ ఆంధ్రజ్యోతి దినపత్రిక రంగుల సప్లిమెంట్ వెలువరించడం చూసి, ఆ విలేఖరి దగ్గరకు మరొక పెద్ద సారాయి కాంట్రాక్టరు వచ్చి, ఇట్లా వ్రాయించుకోవాలంటే ఎంత ఖర్చు అవుతుందని అడిగాడట. ఆ ఒక్క మాట చాలు, పత్రిక మానం పోవడానికి; వ్రాసిన వార్త 'విలువ' తెలుసుకోవడానికి! చాలా గ్రామాలలో విలేఖర్లను లోబరుచుకొని తమకు గిట్టని వారిపై అన్యాయపు ఆరోపణలతో వార్తలు వ్రాయించడం అలవాటై పోయింది. ఇప్పుడు ప్రెస్ కాన్ఫరెన్స్ అంటే మందు వుంటుందా లేదా, డిన్నర్ ఏర్పాట్లు ఎట్లా వుంటున్నాయి. కాంప్లిమెంట్‌లు ఏమైనా ఇస్తున్నారా లేదా అన్నది విచారించడం అలవాటై పోయింది. అడిగి గడియారాలు తీసుకునే వారు, ఉంగరాలు తొడిగించుకునేవారు ఎక్కువై పోయారు. అటువంటి విలేఖరుల పట్ల అవి ఇచ్చే వారికి ఏ పాటి గౌరవం వుంటుంది? పోలీస్ స్టేషన్లకు మామూళ్లు ఇచ్చినట్లు విలేఖర్లకు నెలనెలా ఎంతో కొంత ముట్టచెప్పే పెద్దమనుషులున్నారిప్పుడు. కాంట్రాక్టర్లు, దొంగసారా వ్యాపారులు, స్మగ్లర్లు ఎప్పటికప్పుడు స్థానిక విలేఖర్లను సంతృప్తి పరచే సాంప్రదాయం దాపురించింది. ఈ పరిస్థితులలో విలేఖర్లపై దాడులు జరుగుతున్నాయంటే, జరగవా? ఎవరో ఒకరు దొరికితే చాలు, ఆ గ్రామంలో తమకు విలేఖరి లేడనే కొరత తీరితే చాలు అనే వ్యాపార దృక్పథంలో నియామకాలు జరిపే దినపత్రికల యాజమాన్యాలు - తమ విలేఖర్లకు పాత్రికేయ వృత్తి ధర్మాలను, ప్రవర్తించ వలసిన తీరును, వృత్తి విలువ పెంచాలనాలను తెలియపరిచి, శిక్షణ ఇస్తే తప్ప ఈ పరిస్థితి మారదు. జిల్లా స్థాయిలో నెల్లూరు విలేఖరులే డ్రింక్ పార్టీలకు అలెంజై, స్మగుల్డ్ వాచీలు కాంప్లిమెంట్‌గా పొందేటప్పుడు తాము పరిపరకా సర్దుకుంటే తప్పేమిటన్న భావం గ్రామీణ విలేఖర్లలో వుంది. ఈ అభిప్రాయాన్ని ఎట్లా తొలగించగలం?

రాజకీయవాదులకు పవత్రికలతో పెరిగిపోతున్న అతి చనువుకు ఈ ఊరేగింపు కూడా ఉదాహరణగా కన్పించింది. తీవ్రవాద సంస్థల సభ్యులు జర్నలిస్టులను ప్రక్కకు నెట్టి, మైక్ పట్టుకొని సారా వ్యతిరేక నినాదాలు, గూండారాజ్యం నశించాలనే తమ పడికట్టు స్లోగన్‌లతో నానా రభస సృష్టించారు. జర్నలిస్టుల సంఘానికి, సమస్యలకు ఈ నినాదాలతో ఏమిటి సంబంధం? విలేఖర్ల ఊరేగింపుకు రాజకీయ వాదులు నాయకత్వం వహించి, పెత్తనం చేయడమేమిటి?

ఈ సొద ప్రక్కన పెడితే - నెల్లూరు జర్నలిస్టుల యూనియన్ మాత్రం ఈ మధ్య చురుకుగా పనిచేస్తూంది - కెవి రమణయ్య వంటి పాత తరం నుంచి 'ఈనాడు' శ్రీరాం వంటి కొత్త తరం నాయకత్వానికి మారడమే కారణమేమో! శ్రీ రాం నెల్లూరుకు వచ్చినప్పుడు అమాయకంగా కన్పడేవాడు - పెన్ననీళ్లు బాగా పని చేసి నట్లున్నాయి - ఇప్పుడు జార్జి ఫెర్నాండెజ్ ధోరణిలో ఉపన్యాసాలు దంచేస్తున్నాడు. ఏది ఏమైనా ప్రపంచాన్నంతటినీ కాపాడేది తామేనసే భ్రమలోవుండే పాత్రికేయులు తమను తామే కాపాడు కోవాల్సిన పరిస్థితి ఏర్పడడం దురదృష్టకరం!

## సింహపురి

(4 పేజీ తరువాయి)

సాగుతున్నది. ఫలితంగా ఇండ్ల కరువు, అద్దెలు ఆకాశానికి పోవడం, నిత్య జీవితావసర వస్తువులన్నింటి ధర పెరిగిపోవడం; ఇండ్ల స్థలాల ధరలు, అందుబాటు కాకుండా పరుగులో వుండడం, ఇండ్ల నిర్మాణ పరికరాల ధరలు రోజు రోజుకు పెరిగి పోతుండడం; టవున్ జీవితం, కల్మష భూయిష్టమై పోవడం జరుగుతున్నది. కేవలం స్కూళ్లు, కాలేజీల వల్లనే పల్లెల నుండి టవున్‌లకు వలస జరుగుతున్నదని అనలేము. పల్లె జీవితాలు సుఖశాంతులకు దూరం కావడం, వ్యవసాయం మీద జీవితా గడవక, వేరే వృత్తులు చేపట్టవలసినఅవసరం ఏర్పడడం కూడా వలసకు కారణాలే! ఏమైతేనేమి టవున్ల మీద మనకు సంబంధించి నెల్లూరు మీద ఒత్తిడి మరీ ఎక్కువై పోతున్నది.

నెల్లూరులో ప్రభుత్వ గుర్తింపు పొందిన ప్రాథమిక పాఠశాలలు 30, ప్రాథమికోన్నత పాఠశాలలు 8, హై స్కూళ్లు 8, ప్రభుత్వ ఎయిడ్ లేని హై స్కూళ్లు 8 వుండగా; ప్రభుత్వ గుర్తింపు, సహాయం లేకుండా ఇంగ్లీషు - తెలుగు కాన్వెంట్లు, హై స్కూళ్లు 30, జూనియర్ కాలేజీలు 9 వున్నాయి. ఇవి జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయంలో లభించిన వివరాలు. డి.ఇ.ఒ. ఆఫీసుకు తెలియని స్కూళ్లు, కోచింగ్ సెంటర్లు (రాష్ట్ర వ్యాప్తంగా పేరు పొందిన పెద్దవి కాక) ఎన్ని వందలు వుంటాయో చెప్పలేము. రికగ్నిషన్ లేని స్కూళ్లు, కాలేజీలు 7,10 తరగతులకే కాక, ఇంటర్ డిగ్రీ పరీక్షలకు కూడా విద్యార్థులను ప్రయివేటుగా పంపుతున్నాయి. ప్రభుత్వ రికగ్నిషన్ వున్నా లేకున్నా విద్యార్థులకు కావలసింది పాస్ అయి సర్టిఫికేట్ చేతికి రావడమే గాని, తాము చదివిన స్కూలు ప్రభుత్వ గుర్తింపు వుందేదా లేనిదా అనే వివరం ఎందుకు? తల్లిదండ్రులకు కూడా తమపిల్లలు వుత్తీర్ణులవుతున్నారా లేదా, ఏ స్కూళ్లు, కాలేజీలు అయితే ఎక్కువ మార్కులు వస్తాయి అనేది ముఖ్యం గాని, ఇతర విషయాలు అనవసరం. అందువల్లనే ప్రయివేట్ స్కూళ్ల సంఖ్య ఏటేటికి పెరిగిపోతున్నది.

మేము ఇక్కడ వ్రాయదలచింది అది కాదు. ప్రభుత్వమే ప్రయివేటు స్కూళ్లను, కాలేజీలను ప్రోత్సహించదలచు కున్నప్పుడు మనం ఆక్షేపించి ప్రయోజనం లేదు. కాని గ్రామాలు తదితర చోట్ల స్కూళ్లు ప్రారంభించడానికి ప్రభుత్వం విధించే షరతులు, సౌకర్యాలు టవున్‌లోని స్కూళ్లకు కాలేజీలకు వర్తించవా అని ? ఈ విచక్షణను ఎందుకు చూపుతున్నది అని? ఈ విషయాన్ని మరువారం చర్చించుకుందాం.

## చిత్రసమీక్ష

(7 పేజీ తరువాయి)

(బ్రహ్మానందం) కామెడి ట్రాక్‌తో చిత్రం పూర్తి అవుతుంది.

నటీనటుల్లో నరేష్, శృతి, సింధూజ తమ పాత్రలు సమర్థవంతంగానే పోషించారు. వర్ధమాన నటి సింధూజను దర్శకుడు వాన పాటలను పోలిన పాటల కోసమే ఎంపిక చేసినట్లుంది; ఆ పరమోద్దేశ్యాన్నికి ఆమె తన శక్తిమేర బెరకు లేకుండా తన అందాలను 'ఎక్స్‌పోజ్' చేసి ప్రేక్షకులను తరింపజేసింది. గోపాలం పాత్రకు గిరిబాబు సరిపోలేదు. ముఖంలో హాస్య ప్రియత్వానికి బదులు క్రూరత్వపు కవళికలే ఎక్కువయ్యాయి. బాబూమోహన్, బ్రహ్మానందం, శ్రీలక్ష్మి వై. విజయ, మల్లికార్జునరావు, సుత్తివేలు [illegible] హాస్యనటులు పోటీపడి నటించడం వల్ల కొంత సేపు నవ్వుకో గలం. రచయిత దివాకర్ బాబు చిత్రంలో ఒక పాత్ర ద్వారా చెప్పించిన భాగవతం చెప్పడం కష్టం కాని బూతు కష్టం' కాదు అనే విధంగానే మాటలు రాసాడు. సాహితి, వెన్నెలకంటి రాసిన 'మదిలో మెదిలే' 'చలిగాలేదో కొట్టింది' అనే పాటలు విద్యాసాగర్ ఒక మోస్తరుగా అందించిన సంగీతంతో వినాలనిపిస్తాయి. కోటేశ్వర రావు ఫోటోగ్రఫీ పేలవంగా ఉంది. క్లోజప్‌లో ముఖాలు చూడలేని విధంగా తీసాడు. [illegible] చోట్ల లైటింగ్‌లోపం. నృత్యం పై ప్రసాద్ శ్రద్ధ చూపించడం వల్ల రెండు పాటలు యువతను ఉత్సాహ పరుస్తాయి. ఎడిటింగ్‌లో రాజగోపాల్ ప్రతిభ [illegible] లేక పోయాడు.

## గ్రంథసమీక్ష

(4 పేజీ తరువాయి)

నెట్టుకొన్నది అని చెప్పడంలో విప్రతిపత్తిలేదు.

సరిగ్గా ఈలాంటి వారి మోహన కృష్ణుని వంశీనాదానికి ముగ్ధులై ''పట్టుబడి, వివశలై, మంత్రవివ్వలులై యౌవనోన్మాద నృత్యములు గావించిన గోపికలు. రాయప్రోలు సుబ్బారావు గారి 'రాసపంచాధ్యాయి' అనే అనువాద గ్రంథానికి శ్రీ గోపాలరెడ్డి గారు వాచవిగా వ్రాసిన ప్రవేశికలో వ్రజ భామినుల ఒయ్యారాల సొబగులు, సోయగాలను కళ్లార చూడగలం. శ్రీ రెడ్డి గారు వ్రాసిన ప్రవేశిక వ్యాసం ఒక లఘు కవితా హారం. ''కృష్ణుని తలపులు, చేతలు ఒక్కొక్కటి రసమహాకావ్యములోని ఒక అధ్యాయము అయిను. వాని పై అనురాగవతులగు యాదవ భామల విరహగీతికలు, నిట్టూర్పులు కన్నీళ్లు దాని ప్రకరణము లాయెను. రసజగత్తున కృష్ణుడు మేరు పర్వతమాయెను. వ్రజబాలలు దానిని అంటి ద్రవించు స్రవంతులైరి. మేను దాల్చిన రసపరాకాష్ఠయే కృష్ణుడు. సాక్షాత్తు ప్రేమావతారమే కృష్ణుడు అంటారు శ్రీ రెడ్డి గారు. వేను మరి పరమేశ్వరుణ్ణి 'రసోవైసః' అన్నారు కదా. ఇక్కడ చెప్పబడ్డ ప్రేమ లౌకిక మాలిన్య దూరమైనది. అది ఆధ్యాత్మిక రసజగత్తుకు సంబంధించినది. వ్రజ భామినులు కేవల [illegible] మోహితులు కారు. ఆ [illegible] మానసికమైనది; పవిత్రమైనది; గ్రాహ్యమైనది. ఈలాంటి గుప్త భావా[illegible] శ్రీ రెడ్డి గారు గుప్తంగానే వ్యక్తపరిచారు ఈ వ్యాసకవితలో.

ఈ జీవిత ప్రయాణంలో బహుముఖాలైన అనుభవాలను అనుభూతులను మనం రుచి చూస్తూంటాం. అందులో కొన్నివిషనాగులైతే, మరికొన్ని నాట్య మయూరులు. కొన్ని భయప్రవాహాలైతే మరికొన్ని ఆనంద రసవాహినులు. శ్రీ రెడ్డి గారు చిత్రించిన రసరేఖా చిత్రాలు - స్త్రీలు - పురుషులు, స్నేహ సౌరభాలు, బుట్టమల్లెలు మొదలైనవి మనసున్న మనుషులకు గిలిగింతలు పెట్టి పులకింప జేస్తాయి. కారణం - ఈ చిత్రాలన్నీ మధురమైన అనుభవాలకు చెందినవి కాబట్టి; పాల మీగడ లాంటి మనసులను మన కళ్ళ ముందు ప్రత్యక్షం చేస్తాయి కాబట్టి; సుందర సీమల నుంచి జాలు వారిన కమ్మతెమ్మెరలు కాబట్టి.

బృందావన వీథికలలోని చివరి రెండు వ్యాసాలు శ్రీ రెడ్డి గారి కవితా సంపుటాలు 'అమె-పంచకము, దీర్ఘ కవితలకు సంబంధించినవి. ఆ విమర్శకుల అభిప్రాయాలను సమీక్షించడం ఈ సమీక్షకు సమంజసం కాదు.

శ్రీ రెడ్డి గారి ఈ రేఖాచిత్ర సంపుటిలో వివాదాలు లేవు; హుంకరింపులు లేవు; ముడులు పడిన నొసళ్లు లేవు. ఉగ్రంగా ఉరికే పిడికిళ్లు లేవు; రాక్షసవృత్తులూ, ప్రవృత్తులూ లేవు. ఆచ్ఛాదన లేని తీయని అనుభూతులు గోపాలకిశోరుని వేణునాదంలో కళ్యాణి రాగాలై మనల్ని రసజగత్తుకు తీసుకెళ్తాయి. గుండెకు చందన చర్చ చేసే చేతనా మంజరులు మాత్రమే ఈ రచనల్లో మనల్ని ఆహ్వానిస్తాయి.

ఈ రేఖా చిత్ర వ్యాస కవితా మంజరి ముఖ చిత్రం కూడా గోపాలుడి వంశీగానాన్నే వినిపిస్తూ [illegible] ఆనంద పరవశుల్ని చేస్తుంది.

శ్రీ రెడ్డి గారి కలం నుంచి బృందావన వీధికల వంటి చక్కర బొమ్మలు మరి కొన్ని వెలువడగలవని ఆశిస్తున్నాను.



### నెల్లూరుసబ్‌జడ్జివారికోర్టులో

OSNo 201/1991

Between :- M/s Shiram Chits & Invest (p) Ltd; Rep by its Branch Manager Nellore Plaintiff And 1. S.Raghavendra Rao ; 2. R.Rambabu ; 3. K. Saibaba ; 4. N.V.M. Manoj kumar Defendants 4. N.V.M. Manoj [illegible] S/o. N.S. Murthy ; 9/40 ; Revenue colony ,Nellore - 4 అనువారికి

### నోటీసు

పై దావాలో పై వాది పై ప్రతివాదులపై OSNo 201/91 అను దావా చేసి వున్నారు. ఆ దావా మీ నోటీసు నిమిత్తమై 10-12-'92 తేది వాయిదా వేయబడివున్నది. కాన ఆరోజు మీరు కోర్టు వారి యెదుట హాజరై ఆక్షేపణలు తెలుపుకొనవలయును. లేనిచో దావా మీ పరోక్షమున తీర్మానించబడును.

**పేరేపి వేణుగోపాల్**

**పి.సురేంద్ర**

వాది తరఫున అడ్వకేట్లు.

### వేలం ప్రకటన

అఫిషియల్ రిశీవర్ వారి కార్యాలయము, నెల్లూరు

I.P. No. 3/84 సబ్‌కోర్టు నెల్లూరు.

మెంటా వెంకట సుబ్బారావు, తండ్రి వెంకట సుబ్బయ్య, ప్రస్తుతము C/o. చల్లారత్తయ్య, [illegible]పూరు గ్రామము, మెళ్ళచెరువు పోస్టు మరియు మండలం, నల్లగొండ జిల్లా ఇన్సాల్వెంటు

పై నెంబరు ఐ.పి. లోని ఇన్సాల్వెంటు తాలూకు నెల్లూరు మునిసిపాలిటి పరిధిలోని స్టోన్‌హౌస్‌పేటలోని శ్రీరంగరాజపురములోగల పాత వార్డు నెం.5 డోరునెం.477(కొత్తవార్డునెం. 5డోరు నెంబరు. 710)గల మిద్దె ఇంటిని మరియు స్థలమును (దక్షిణము వైపుగల భాగములో 1/4 వ భాగమును) నెల్లూరులోని పై కార్యాలయములో 11.12.92 తేది న పగలు 2.గంటలకు బహిరంగముగా వేలము వేయబడును. పాట దారులు షరత్తులు, ఇస్తిహారు వగైరాలు పై కార్యాలయము పనిచేయు వేళలలో వచ్చి తెలుసుకొనవచ్చును.

**యం.కె. సింగరాజు**

అఫిషియల్ రిశీవర్ , నెల్లూరు.

గమనిక: పై ఇల్లు గాదంశెట్టి బాలనరసింహం యొక్క హక్కుకు లోబడి యూలము వేయబడును.

# గూడూరు టౌన్‌లో బ్రతుకు దుర్భరం!

## జిల్లా వార్తలు

గూడూరు పట్టణ ప్రజలు నిత్యం సమస్యలతో సహజీవనం చేయవలసిన దుస్థితి దాపురించి వుంది. పేరుకు మునిసిపాలిటీ అయినా రోడ్ల పై నడవలేం. మంచి నీట్లై కటకటలాడాలి; కుప్పలుగా పేరుక పోయిన చెత్తా, చెదారాల నుంచి వెలువడే దుర్గంధాన్ని పీలుస్తూ కాలం వెళ్లబుచ్చాలి. 1952 లో 20 వేల జనాభా కల్గి వున్న గూడూరును మునిసిపాలిటీగా చేసారు. ప్రస్తుత జనాభా 80 వేలకు చేరుకున్నా సదుపాయాలు మాత్రం పెరగలేదు. ఏవో కొన్ని వార్డుల్లో తప్ప మిగిలిన వార్డులలో రోడ్లు అధ్వాన్న స్థితిలో వున్నాయి. పాదచారులు, వాహన చోదకులు ఈ రోడ్ల పై నడవను పడే కష్టాలు అన్నిన్ని కావు. ఇటీవల పడిన వర్షాలకు రోడ్లు మరీ పాడయ్యాయి. సుందరమహల్ సందు, నిమ్మకాయల మార్కెట్, కూరగాయల మార్కెట్, మునిసిపల్ పాత బస్టాండుల వద్ద మరీ దుస్థితిలో వుంది. పారిశుధ్య విషయానికొస్తే ఏ మురికి కాలువను చూసినా చిన్న చిన్న పురుగులనిపిస్తాయి. రోజూ శుభ్ర పరచక పోవడం వల్ల చెత్తా చెదారం ఈ నీటితో కలసి దుర్గంధం వెదజల్లుతుంది. వీటిలో ఉదయం పందులు, కుక్కలు స్వైర విహారం చేస్తే రాత్రుళ్లు దోమలు ఆవాసంగా చేసుకొన్నాయి. పరిశుభ్రత విషయంలో మునిసిపల్ శానిటరీ శాఖ పూర్తిగా విఫలమయ్యిందని చెప్పవచ్చు.

చివరగా నీటి విషయానికి వస్తే గత నెల రోజుల నుండి జోరుగా పబ్లిక్ కొళాయిల్లోని నీరు కాఫీ రంగును పోలి వస్తుంది. అవి కూడా సక్రమంగా చాలినన్ని రావు. ట్యాంకుల కెపాసిటీకి మించిన కనెక్షన్లకు బడా బడా వ్యక్తుల ఇంటికి వుండే అక్రమ మోటారు కనెక్షన్లు తోడయ్యాయి. దీనితో పల్లపుప్రాంత ప్రజలు నీటికై పడే కష్టాలు వర్ణనాతీతం. ఇటీవల అడిగే ప్రజా ప్రతినిధులు కూడా లేకపోవడం మునిసిపల్ అధికార్లు సమస్యల గూర్చి పట్టించుకోవడం మానేశారు. యువకుడు, వుత్సాహశీలి, ఇన్‌ఛార్జ్ ప్రత్యేకాధికారియైన సబ్ కలెక్టర్ మునిసిపల్ సమస్యల విషయంలో చొరవ చూపించాలని ప్రజలు కోరుతున్నారు. మరి ఆయన ఏ విధంగా స్పందిస్తారో చూడాలి.

## స్మృత్యంజలి



అమరజీవి

**కూరపాటి**

**రామచంద్రారెడ్డిగారు**

సంస్మరణ 6.12.92 తేది

మిమ్మల్ని ఎన్నటికీ మరచిపోలేని

* సోదరీమణులు

శ్రీమతి ఈదూరు కమలమ్మ

డాక్టర్ కె.రాజమ్మ B.A., M.D., D.C.H.

రిటైర్డ్ సివిల్ సర్జన్-నెల్లూరు. ఫోన్: 25737

* మేనల్లుడు

డాక్టర్ ఐ.వి. రఘునాథ రెడ్డి ఎం.డి.యస్.,

డెంటల్ సర్జన్

### నిధులు మంజూరైనా మండపం కట్టలేదు

రాపూరు మండలంలోని ప్రముఖ పుణ్యక్షేత్రమైన పెంచలకోనలో కళ్యాణమండపం కట్టేందుకు నిధుల మంజూరైనా ఇంత వరకు దాని పని ప్రారంభించని అధికార్ల తీరుని ప్రజలు విమర్శిస్తున్నారు. రాపూరు ఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు కృషి ఫలితంగా కళ్యాణమండపానికి తిరుమల తిరుపతి దేవస్థానం 15 లక్షలు మంజూరు చేసింది. డిపాజిట్ కట్టవలసిన ధనాన్ని పెంచలకోన దేవస్థాన ట్రస్ట్‌బోర్డ్ సిద్ధపరచి, స్థలాన్ని కూడా చూపించినా ప్రయోజనం లేకుండా పోయింది. ఇక్కడ కళ్యాణమండపం కడితే రాపూరు, కలువాయి, పొదలకూరు ప్రజలకు ఎంతో వుపయోగకరంగా ఉంటుంది. ప్రస్తుతం ఈ మూడు మండలాల ప్రజలు నెల్లూరులో, లేక పోతే సొంత ఇళ్లలోనో వ్యయప్రయాసలతో పెండ్లిండ్లు జరుపవలసి వస్తుంది.

### రాపూరులో నాటుసారా

రాపూరు మండలంలో ఇటీవల నాటు సారా అమ్మకాలు విచ్చలవిడిగా సాగుతున్నాయి. కడప జిల్లా సరిహద్దు గ్రామాలతో పాటు పొదలకూరు నుండి నాటు సారా వచ్చి ఇక్కడ చేరుతున్నది. ప్రభుత్వ సారా అందుబాటులో లేకపోవడం, చవకగా నాటు సారా లభిస్తుండడంతో సారా ప్రియులు దీనిపై మక్కువ చూపుతున్నారు. ప్రతి రోజూ సాయంత్రం చీకటి పడ్డాక జీపుల్లో గ్రామ గ్రామానికి వచ్చి నాటు సారాను యధేచ్ఛగా సరఫరా చేసి పోతున్నారు. ఎక్సైజ్ పోలీసులు గాని సారా వ్యతిరేకోద్యమకారులు గాని దీన్ని అడ్డుకొనే ప్రయత్నమేదీ చేయకపోవడం శోచనీయం.

### ఎగుమతులపై రోటరీ సదస్సు

గూడూరు రోటరీ క్లబ్, నెల్‌కాస్ట్ స్టాఫ్‌వెల్‌ఫేర్ అసోసియేషన్ సహకారంతో డిశంబర్ 6 న భారీ స్థాయిలో 'ఎగుమతులు, అవకాశాలు – పద్ధతుల' పై సదస్సు నిర్వహిస్తుంది. డి.ఎస్.ఆర్. కమ్యూనిటీ హాల్‌లో జరిగే ఈ సదస్సును రాష్ట్ర సమాచార, పౌర సంబంధాల మంత్రి శ్రీ పసల పెంచలయ్య ప్రారంభిస్తారు. గూడూరు శాసనసభ్యులు శ్రీయుతులు పత్రా ప్రకాశరావు, పరిశ్రమల శాఖ కార్యదర్శి జి.హరినారాయణ, జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివరావు, జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, గూడూరు సబ్ కలెక్టర్ సునీల్ వర్మ ముఖ్యఅతిథులుగా విచ్చేస్తారు. జిల్లాలో ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న రొయ్యలు, ఖనిజాలు, గ్రానైట్ పరిశ్రమలకు సంబంధించిన ఎగుమతులు, దిగుమతుల సమాచారాన్ని ఈ రంగాల్లో నిష్ణాతులు వివరిస్తారు. ఈ అవకాశాన్ని ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలు వుపయోగించుకోవాలని నెల్‌కాస్ట్ టెక్నికల్ డైరక్టర్ శ్రీ వై. విద్యాసాగం కోరుతున్నారు.•

### విద్యార్థినికి బహుమతి

గత విద్యా సంవత్సరం పదవ తరగతి పబ్లిక్ పరీక్షలలో జిల్లాలో అత్యధిక మార్కులు తెచ్చుకొన్న దాసరి అమృతకు విడవలూరు అభ్యుదయ రైతు శ్రీ సోమవరపు రమణారెడ్డి నగదు బహుమతి 1 తేదీ జరిగిన విడవలూరులో జరిగిన ఒక ప్రత్యేక కార్యక్రమంలో అందించారు. రమణారెడ్డి విద్యార్థులను ప్రోత్సహించేందుకు 5 వేల రూపాయలను జిల్లా విద్యాశాఖ ఖాతాలో డిపాజిట్ చేశారట. దీని ద్వారా వచ్చే వడ్డీని ప్రతి ఏడాది జిల్లాలో పదవ తరగతి పరీక్షల్లో అత్యధిక మార్కులు తెచ్చుకొన్న విద్యార్థినికి ఇస్తారట. మంచి పద్ధతికి శ్రీకారం చుట్టిన ఆయనను అభినందించాలి.



గత సంవత్సరం పదవతరగతి పరీక్షల్లో జిల్లాలో అత్యధిక మార్కులు సాధించిన విడవలూరు విద్యార్థిని దాసరి అమృతకు ప్రోత్సాహక బహుమతి అందిస్తున్న విడవలూరు అభ్యుదయ రైతు ఎన్. రమణారెడ్డి

## శ్రీపాదకు మంత్రిత్వం

మొదటి పేజీ కొరవ

ఎవరూ లేకపోవటంతో విస్తరణలో ఈ జిల్లాల నుండి ఇరువురు రెడ్లకు మంత్రి వర్గంలో స్థానం కల్పించే అవకాశముంది. అదే జరిగితే చిత్తూరు జిల్లా నుంచి మబ్బు రామిరెడ్డి గానీ కిరణ్‌కుమార్ రెడ్డికి గాని లైటుకారు ఖాయం. కృష్ణాజిల్లా నుంచి వేదవ్యాస్‌కు అవకాశాలు హెచ్చుగా వున్నాయి. నేదురుమల్లి వర్గీయుడు పేర్ని కృష్ణమూర్తి ఈ సారి బాగా ఆశలు పెట్టుకొని వున్నారు. ప్రస్తుత క్యాబినెట్‌లో వెనుకబడిన తరగతులకు తక్కువ ప్రాతినిధ్యం ఉండటంతో విస్తరణలో ఒకరిద్దరు బి.సి.లకు స్థానం దొరకవచ్చు. ఎన్టీఆర్‌ను ఓడించిన మాజీ మంత్రి చిత్తరంజన్‌దాస్ ఢిల్లీ వర్గాల ద్వారా తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. బిసిలకు ఇచ్చే పక్షంలో చిత్తరంజన్‌కు ఇవ్వక తప్పదేమో.

### నెల్లూరు జిల్లాకు రెండో మంత్రి పదవి

నేదురుమల్లి నడుంకడితే విస్తరణలో నెల్లూరు జిల్లాకు రెండో మంత్రి పదవి లభించ వచ్చు. ప్రస్తుతం జిల్లాలో మాజీ మంత్రి మాదాల జానకి రామ్, పత్రా ప్రకాశరావు మినహా మిగతా ఎమ్మెల్యేలందరూ మంత్రి పదవి పై ఆశలు పెట్టుకొని వున్నారు.

కోట్లకు సన్నిహితుడినని చెప్పుకుంటున్న కావలి [illegible]దిరెడ్డి ఈసారి కూడా రంగంలో వున్నారు. ఆత్మకూరు డాక్టర్ సుందర రామిరెడ్డి ప్రయత్నం వుండనే వుంది. వెంకటరత్నం నాయుడు సీనియారిటీని నమ్ముకొని వున్నారట. సి.వి. శేషారెడ్డి మాత్రం సర్వం జనార్ధనుని దయ అంటూ నమ్మకంగా వున్నారని తెలిసింది. నేదురుమల్లి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఎమ్మెల్యేలను లాలించి, బుజ్జగించి జనప్రియకు తోడ్కొని వచ్చిన శేషారెడ్డి కోసం ఈమారు జనార్ధన రెడ్డి ప్రయత్నిస్తారో లేదో వేచి చూడాల్సి వుంది. కోట్ల చేత బుద్ధిమంతుడు అన్పించుకున్న విష్ణువర్ధన్ రెడ్డి అటు నేదురుమల్లితో కూడా సయోధ్యగా వుంటున్నారు. కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి మాత్రం ఉలుకూ పలుకూ లేకుండా వున్నారు. ఆయనకు మంత్రి పదవి రావడమంటే 'కలయా? కోట్ల మాయయా' అనుకోవాల్సిందే.

### అసెంబ్లీకి ముందే విస్తరణ

డిశంబరు 14 వ తేదీ నుంచి పది రోజుల పాటు శీతాకాల సమావేశాలు నిర్వహించాలని కోట్ల తలపెట్టారు. స్పీకర్‌గా శ్రీపాదరావును తప్పించాలనుకుంటున్న కోట్ల అసెంబ్లీ సమావేశాలకు ముందుగానే మంత్రి వర్గాన్ని విస్తరించే అవకాశముంది. కోట్ల ఎమ్మెల్యే కాకపోవటంతో అసెంబ్లీలో అధికార పార్టీ నాయకుడిగా వుండే హక్కు లేదు. అందుకే సీనియర్ అయిన రోశయ్యనుగానీ, సొంత మనిషి అయిన రామిరెడ్డిని గానీ నాయకుడిగా నియమిస్తారట.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.